Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 51 • 23-12-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# ముఖ్యమంత్రికి ఉపఎన్నికలొక పీడకల!

అవిశ్వాస తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేసిన 17 మంది జగన్ ఎమ్మెల్యేలను అనర్హులుగా ప్రకటించే అంశం, కాంగ్రెస్‌కు పెద్ద సంకటంగా మారింది. వీరి శాసన సభ్యత్వాలను రద్దు చేయడం చిటికెలో పని. అందుకు వారు కూడా సిద్ధంగా ఉన్నారు. మళ్లీ ఎన్నికలు వచ్చినా గెలవడం సునాయాసమన్న నమ్మకం ఉండడమే అందుకు కారణం. అదే నమ్మకం కాంగ్రెస్‌ను కలవరపెడుతున్నది. ఇప్పటికే వివిధ కారణాల వల్ల 7 స్థానాలకు ఉప ఎన్నికలు జరుగనున్నాయి. వాటికి ఈ 17 జత కలిస్తే మినీ జనరల్ ఎన్నికల వాతావరణం ఏర్పడుతుంది. ఆ స్థాయిలో రాజకీయ పోరాటం చేసే నైతిక సామర్థ్యం, ఆత్మబలం ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డిలో లేవు. ఎవరెన్ని చెప్పినా రాష్ట్రంలో జగన్ గాలి తోలుతున్నదన్నది కాదనలేని నిజం. సిబిఐ కేసులలో జగన్ జైలుకు వెళ్లి, ఆరేడు నెలలపాటు లోపలే ఉండిపోతే పరిస్థితి ఎట్లా ఉంటుందో చెప్పలేము కానీ ఏ కారణం వల్లనో జగన్‌ను జైలుకు పంపే విషయంలో సిబిఐ మీనమేషాలు లెక్కిస్తున్నది. అందువల్ల ఆ అవకాశం ఉప ఎన్నికలకు అందుబాటు కాకపోవచ్చు. స్థానిక సంస్థల ఎన్నికలను ముందుకు తెచ్చి, జగన్ గ్లామర్ కొంత ఖర్చుయ్యేట్లు చూడాలని తలపోశారు. కానీ జనాభా లెక్కలు, రిజర్వేషన్ల పేచీతో అది వీలయ్యేట్లు లేదు. అందువల్ల ఇప్పటికిప్పుడు 17 మందిని అనర్హులుగా ప్రకటించడం అంటే కొరివితో తలగోక్కోవడం క్రింద లెక్క. స్పీకర్ నిర్ణయాన్ని వాయిదా వేయించడం ద్వారా కొన్ని నెలలపాటు ఈ అంశాన్ని పెండింగ్‌లో పెట్టే అవకాశం ఉంది. కానీ అందుకు పూనుకొంటే జగన్ ఎమ్మెల్యేలు ఎగతాళి చేస్తారు. తమను చూసి భయపడి స్పీకర్ కొంగు చాటున దాక్కున్నారని వెటకారం ఆడుతారు. అది కూడా రాజకీయ దుర్భరమైన పరిస్థితే.

మరొక ప్రక్క చివరి ఆరు నెలలైనా సరే ముఖ్యమంత్రి పీఠం ఎక్కి, మక్కువ తీర్చుకోవాలని ఉర ఉరలాడుతున్న బొత్సా సత్తిబాబు వంటి వారు అర్జెంట్‌గా ఉప ఎన్నికలకు పెట్టాల్సిందే అని ఒత్తిడి తెస్తున్నారు. ఢిల్లీకి వెళ్లి అధిష్టానం పెద్దల వద్ద ఆగం చేస్తున్నారు. ఉప ఎన్నికలలో కాంగ్రెస్ ఎటూ గెలవదు కాబట్టి, ఆ నెపం చూపి కిరణ్‌కుమార్‌రెడ్డిని గద్దె దించవచ్చునన్నది వారి ఆశ.

మొత్తానికి ఉప ఎన్నికలు ముఖ్యమంత్రికి పీడకలగా మారుతున్నాయి. నిద్రలేని రాత్రులు సృష్టిస్తున్నాయి. జగన్ మాత్రం ఉప ఎన్నికలకు సిద్ధం కావాలని తన ఎమ్మెల్యేలను కోరుతున్నాడు. అనర్హత నోటీసులు అందుకున్న వారందరూ ఒకేసారి స్పీకర్ వద్దకు వెళ్లి, తమ సభ్యత్వాలు వదలుకోవాలని, లేకుంటే ఏదో ఒక నెపం చూపి ఈ అంశాన్ని వాయిదా వేయడమో లేక విడతలు విడతలుగా ఉప ఎన్నికలు వచ్చేట్లు పథకం పన్నడమో చేస్తారని జగన్ చెప్తున్నాడు. ఆయన వద్ద మిగిలిన 17 మంది ఆయన మాట జవదాటే పరిస్థితి లేదు కాబట్టి వారంతా రేపు 29వ తేదీ లోపల ఒకే జట్టుగా స్పీకర్ వద్దకు వెళ్లబోతున్నారు.

## చిరంజీవి బలిపశువే!



కేంద్ర మంత్రిత్వం కోసం చకోరపక్షి వలె ఎదురు చూస్తున్న చిరంజీవికి ఇప్పట్లో ఆ భాగ్యం దక్కే సూచన కన్పించడం లేదు. ఆయన ఢిల్లీలో గద్దె ఎక్కాలంటే, రాజ్యసభ సభ్యత్వం కావాలి. రేపు ఫిబ్రవరిలో కేశవరావు, దాసరి నారాయణ రావు స్థానాలు ఖాళీ అవుతున్నాయి. వాటిలో ఒక దానికి ఆయన్ను ఎంపిక చేస్తే, ఉన్న చీకాకులు చాలవన్నట్లు తిరుపతి శాసనసభ ఉప ఎన్నిక వచ్చి పైన పడుతుంది. అక్కడ కాంగ్రెస్‌ను గెలిపించుకోవడం కుందేటి కొమ్ము సాధించడంతో సమానం. పైగా తిరుపతి అంటే ముఖ్యమంత్రి స్వంత జిల్లా. తమ జిల్లాలోనే ఉప ఎన్నికలో గెలవలేదనే అప్రతిష్ట నెత్తికెత్తుకోవడం కిరణ్ కుమార్‌రెడ్డికి ఇష్టం లేదు. దానితో చిరంజీవి కేంద్ర మంత్రిత్వ ఆశలకు ఆయన గండి కొడుతున్నాడు. మరీ ఒత్తిడి వస్తే రాష్ట్ర క్యాబినెట్‌లోనే చిరంజీవికి ఏదో ఒక ముఖ్యమైన శాఖ ఇస్తాను తప్ప ఉప ఎన్నికల ప్రమాదం తెచ్చి పెట్టవద్దని ఢిల్లీ పెద్దలను వేడుకొంటున్నాడు ముఖ్యమంత్రి.

# మద్యం మామూళ్లు

బ్రాందీ వ్యాపారంలోని మామూళ్ల భాగోతాన్ని వెలికి తీసి సంచలనం సృష్టించారు ఏసిబి అధికారులు. ఎక్కడో తీగ లాగితే ఇంకెక్కడో డొంక కదిలినట్లు బయటపడింది. సారాయి, బ్రాందీ వ్యాపారం మాఫియా తరహాలో నడవడం మనకు కొత్తేమీ కాదు. మాఫియా తరహా అంటే అర్థం చట్టాలు, ప్రభుత్వ నియంత్రణలు, నియమాలను ధిక్కరించి, స్వంత సామ్రాజ్యంగా నడుపుకోవడం. తమకు అడ్డు వచ్చిన వాడిని ముందు నయాన, తర్వాత భయాన లొంగదీసుకోవడం మాఫియా సిద్ధాంతం. లాభం ఒక్కటే దాని పరమార్థం. ఇతరత్రా ఏ అంశాన్నీ పరిగణనకు తీసుకోరు. నాటు సారాయి కాసే రోజుల నుంచి ఇదొక సాంప్రదాయంగా స్థిరపడింది. దీనికి అడ్డుకట్ట వేయాలని ఎన్టీరామారావు మద్యం టోకు వ్యాపారాన్ని ప్రభుత్వ నిర్వహణలోకి తెచ్చారు. కానీ ఆ తర్వాత వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వాలు మద్యంతో వచ్చే రాబడిని తమ బడ్జెట్లకు ప్రధాన వనరుగా మార్చుకోవడంతో బ్రాందీ మాఫియా ముఠాలు రిటైల్ అంగళ్లలో తిష్ట వేశాయి. జనం చేత ఎక్కువగా త్రాగించే వాడే నిజమైన ప్రభుత్వ సేవకుడనే సిద్ధాంతాన్ని అధికారంలోకి వచ్చిన ప్రతి సర్కారూ నెత్తికెత్తుకోవడంతో గత నాలుగైదేళ్లుగా మద్యం మాఫియా వూడలు దిగిన విష వృక్షం వలె విస్తరించిపోయింది.

రాష్ట్ర ప్రభుత్వ వార్షిక ఆదాయం పద్దులలో వాణిజ్య పన్నుల తర్వాత అతి పెద్ద మొత్తం బ్రాందీ షాపుల రాబడి మాత్రమే. ఏటా దాదాపు 15వేల కోట్ల రూపాయలు వివిధ రూపాలలో ఖజానాకు చేరుతున్నాయి. ఖజానాకు చేరే సొత్తుకు సరి సమానంగా లాభాలు ఆర్జిస్తున్నారు వ్యాపారులు. దానితో అందరి కళ్లు బ్రాందీ షాపుల మీదనే పడుతున్నాయి. రాజకీయవాదులు, పోలీసు, ఎక్సైజ్, రెవిన్యూ, మునిసిపల్ అధికారులు, చివరకు పత్రికా విలేకరులు కూడా బ్రాందీ షాపుల యజమానులను జలగల వలె పట్టిపీడిస్తున్నారు. ఎవరితో పేచీ పెట్టుకొన్నా తంటాయే. ఏదో ఒక నెపంతో అంగడి మూయించి వేస్తున్నారు. అదే జరిగితే దివాలా తప్పదు. దానికి భయపడి అడిగిన ప్రతివాడికీ నెల మామూళ్లు ఇవ్వడం ఒక ఆనవాయితీగా పెట్టుకొన్నారు వ్యాపారులు. దానితో వారికి ఖర్చులు పెరిగిపోయాయి. ఆ లోటు పూడ్చుకోవాలంటే జనం జేబులు కొల్లగొట్టక తప్పదు. అందుకొక మార్గం ప్రభుత్వం నియమించిన ఎమ్మార్పీ ధర కంటే ఎక్కువకు అమ్ముకోవడం. దానితో బ్రాందీ షాపుల యజమానులు రాజకీయ, అధికార వర్గాలకు మరింత లొంగి బ్రతక తప్పదం లేదు. ఎవరికి వారు విడిగా రాజకీయ, అధికార వర్గాలను మచ్చిక చేసుకోవడం ఆచరణ సాధ్యం కాకపోవడంతో, బ్రాందీ షాపుల యజమానులు స్థానికంగా సిండికేట్ రూపం సంతరించుకొన్నారు. చిల్లరగా వాటాలు దండి, టోకున మామూళ్ల సమర్పిస్తున్నారు.

ఈ విష వలయం గురించి అందరికీ తెలుసు. కానీ అదొక విశేషం కాదన్నట్లు వూరకుండిపోయారు అందరూ. ఏసిబి దాడులతో ఇప్పుడు వార్తలకెక్కింది. ఈ దాడులపై రాజకీయవాదుల ఆగం చూస్తుంటే ఆశ్చర్యం కల్గుతున్నది. ఇంత కాలం తమకు తెలియకుండా పెద్ద కుంభకోణం జరిగిపోతున్నట్లు, ఇప్పుడే ఆ విషయం తమ దృష్టికి వచ్చినట్లు నటిస్తున్నారు అన్ని పార్టీల నేతలు. ఈ ముడుపులలో, ఈ మాఫియా సామ్రాజ్యంలో తమ తమ పార్టీలకున్న భాగస్వామ్యం ప్రజల చర్చకు రాకుండా మాయ చేయ చూస్తున్నారు.

జమీన్‌రైతు

నిజానికి దాడులు చేయడం తప్ప ఏసిబి చేయగల్గింది ఏదీ లేదు. ఏ చట్ట ప్రకారం కూడా వ్యాపారుల మీద చర్య తీసుకొనే అవకాశం లేదు. మహా అయితే ఇన్‌కంట్యాక్స్ చీకాకులు సృష్టించవచ్చు. కనీసం సిండికేట్ కార్యాలయాలలో తమకు లభించిన ముడుపుల జాబితాలను బయట ప్రపంచానికి వెల్లడించే సాహసం కూడా వారికి లేదు. ఆ జాబితాలు ముఖ్యమంత్రి చేతికి చేరుతాయి. ఎమ్మెల్యేలు, మంత్రులు మాట విననప్పుడల్లా బ్లాక్ మెయిల్ చేసుకొనే అవకాశం కల్పిస్తాయి. అంతకంటే అధికంగా ఈ దాడుల వల్ల ఉపయోగం ఏదీ లేదు.

గొంగట్లో అన్నం తింటూ వెంట్రుకలు ఏరాలనుకొనే మూర్ఖత్వం ఇది. బ్రాందీ మాఫియా మూలాలు అన్ని రాజకీయ పార్టీలలోనూ స్థిరపడి వున్నాయి. వాటిని వదలుకోవడానికి ఏ రాజకీయ పార్టీ, ఏ ఎమ్మెల్యే, ఏ మంత్రీ సిద్ధంగా లేదు. ప్రజల కళ్ల నీళ్లు తుడవడానికి, మాయమాటలతో మోసపుచ్చడానికి నోటికొచ్చిన విమర్శలు చేస్తున్నారు, అంతే.

## జనవాణి

### ఉరిశిక్ష ఉండి తీరాల్సిందే!

భారతదేశం ప్రజాస్వామ్య దేశం. పార్లమెంటరీ ప్రభుత్వం తయారు చేసిన చట్టం ఉరి. ఎవరినైనా హత్య చేసినపుడు, ఆ శిక్ష నిర్ధారణ అయినపుడు మనమేర్పరచుకొన్న న్యాయస్థానాల్లోని న్యాయమూర్తులు ఉరిశిక్ష విధిస్తారు. జైళ్లలో వాటిని అమలు పరుస్తారు. హత్యకు గురైన కుటుంబం తమకు జరిగిన అన్యాయం, ఆ హత్య చేసిన వారు ఇంకెవ్వరికి కష్టం కల్గించలేరని సంతోషిస్తారు. ఉరిశిక్ష అమలు నిషేధించాలనుకొనే మేధావులు, రాజకీయ నాయకులు కాదు ఉరిశిక్ష గూర్చి మాట్లాడాల్సింది. హత్యకు గురైన కుటుంబాల వారే దీనిని గూర్చి ఆలోచించడం మంచిది. నిర్ణయం కూడా న్యాయస్థానాలు వారికే వదలి వేయడం ఉత్తమం.

తూపిలి వనమాలి — నెల్లూరు

### మధ్యతరగతీయులకే కష్టాలు!

మధ్యతరగతి ప్రజలే అన్ని రకాల కష్టాలు పడాల్సి వస్తుంది. ఈ వర్గం ప్రజల ఆదాయం తక్కువ. విపరీతంగా పెరిగిన నిత్యావసర వస్తువుల ధరల మధ్య పూట గడవడమే కష్టంగా వుంది. పిల్లల చదువు, బాడుగిళ్లలో జీవనంతో వీరి జీవితం గుది బండగా మారుతుంది. పేదవాళ్లకు తెల్లరేషన్ కార్డులో బియ్యం, చక్కెర, కిరోసిన్, నూనె, పప్పులు, ఆరోగ్యశ్రీ కార్డు, ఇందిరమ్మ ఇళ్లు అందుబాటులో వున్నాయి. ధనవంతులు ఎలాగోలా బతికేస్తారు. పింక్ కార్డులున్న మధ్యతరగతియులకు కిలో పది రూపాయలకు బియ్యం, కిరోసిన్, లక్ష రూపాయల లోపు ఆదాయం వుండేవారికి ఆరోగ్యశ్రీ కార్డులిస్తే ఆహార భద్రత, ఆరోగ్య భద్రత కల్పించిన వారవుతారు. ఈ విషయమై ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి ఆలోచించ మనవి.

పి.వీణారాణి — నెల్లూరు

### జమీన్‌రైతు ముందే పసిగట్టింది

సేవాభావంతో పని చేయాల్సిన నెల్లూరు రెడ్‌క్రాస్ సంస్థ వర్గపోరుకు తోడుగా ఆధిపత్య చెలాయింపులతో భ్రష్టుపట్టిందని 'జమీన్‌రైతు' నవంబర్ 25తేది సంచికలో వ్రాసింది. మీరు వ్రాసిన తర్వాతనైనా వున్నతాధికారులు మేల్కొనివుంటే ఓ అమాయకురాలికి రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంకులో హెచ్ఐవి రక్తం ఇచ్చి వుండేవారు కాదు. ఆమె భవిష్యత్తును నాశనం చేసి వుండేవారు కాదు. రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంకును నిర్వాహకులు తమ స్వంత ఆస్తిలా అనుభవిస్తున్నారు. తరచూ కార్యవర్గాలు మారితే ఈ సమస్యలు రావు. ఇప్పటికైనా చేసిన తప్పులు రెడ్‌క్రాస్ నిర్వాహకులు ఒప్పుకొని బాధితురాలు హసీనాకు పెద్ద మొత్తంలో ఆర్థిక సహాయంతోపాటు ఆమె కుటుంబాన్ని ఆదుకోవాలి.

మోడెం కోటారెడ్డి — పడుగుపాడు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

26-12-1941
పేజీలు : 8 వెల: అణా

### వీరెవరు?

జ్ఞాన ప్రకాశరావను పేరుతోనొక హరిజనుడు యోగానంద శిష్యుడనని, డాక్టరునని చెపుతూ గ్రామాలలో ద్రవ్యం వసూలు చేస్తున్నాడు. ఒకరికి గూడా బాగు చెయ్యలేదు. హరికథలు కూడా చెప్పుచున్నాడు. వీరెవరో?

***

30-12-41దిన వినోభాబావే గారు ఆ రాత్రి 3 గంటల మెయిలులో మద్రాసు నుండి నెల్లూరుకు వచ్చి రాఘవయ్య గారు యానాదుల మధ్య చేయుచుండు పనిని జూచి 31-12-41 రాత్రి మెయిలులో తన ఆశ్రమునకు పోయెదరు.

***

గాంధీ జయంతి తాలుకు గత మూడు సంవత్సరాలుగా నాలు వసూలు డబ్బు షుమారు 3,4వేలు యానాదులకు ప్రత్యేకంగా వినియోగింపవలెనని గాంధీగారికి రాఘవయ్య గారు వ్రాసిన జాబుపైన దానిని గూర్చి ఒక స్కీము తయారుచేసి చరఖా సంఘము వారికి పంపవలెనని మహాత్ముడు సీతారామశాస్త్రుల గారి ద్వారా రాఘవయ్య గారికి తెలిపిరి.

### ఆంధ్రాబ్యాంక్ తునక

ఆంధ్రా బ్యాంక్ వారి బ్రాంచి 17వ తేదీన ఆమంచర్ల కృష్ణారావు పంతులు గారింట్లో రామచంద్రారెడ్డి గారి ఆధ్వర్యాన పంతులు గారి వల్ల ప్రారంభింపబడింది నెల్లూరులో.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

22-12-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### కస్తూరిదేవి విద్యాలయ ఆడిటోరియం

శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో నిర్మాణమైన 'రవీంద్రనాథ్ ఠాగూర్ భవన' ప్రారంభోత్సవం కేంద్ర సాంస్కృతిక వ్యవహారాల మంత్రి ఆచార్య హుమయూన్ కబీర్‌చే 28వ తేది సాయంత్రం 5 గంటలకు జరుపబడుతుంది. డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారు, విశ్వకవి, శ్రీమతి ఎం.ఎస్.సుబ్బులక్ష్మి చిత్రపటాలను ఆవిష్కరించెదరు. ఆంధ్ర విద్యామంత్రి ఎస్.బి.పి.పట్టాభిరామారావు గారు అధ్యక్షత వహింతురు.

### వి.ఆర్.కాలేజి సమ్మె

12వ తేది ప్రారంభమైన వి.ఆర్.కాలేజి విద్యార్థుల సమ్మె ఇంకా కొనసాగుతున్నది. అయితే ఎలాంటి దుస్సంఘటనా లేకుండా ప్రశాంతతను కాపాడడం ప్రశంసనీయమైన విషయం. కావలి విద్యార్థులు గూడా సమ్మె కొనసాగిస్తున్నారట గానీ కళాశాల మాత్రం మూసివేయబడినట్లు తెలుస్తున్నది.

### నటి సావిత్రి భూరి విరాళం

ప్రఖ్యాత సినిమా నటి శ్రీమతి సావిత్రి తాను నటిస్తున్న నూరవ చిత్రం విడుదలకానున్న సందర్భంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి బీద విద్యార్థుల సౌకర్యార్థం ఇరవై ఐదువేల రూపాయలు విరాళమివ్వదలచినట్లుగా వాగ్దానం చేశారు. విజయవాడ అలంకార్ థియేటర్‌లో జరిగిన 'కలసి ఉంటే కలదు సుఖం' చలన చిత్ర శతదినోత్సవ సందర్భంలో శ్రీమతి సావిత్రి పై ప్రకటన చేశారు.

# నెల్లూరు ముచ్చట్లు

విశ్వరూప

## వివేకా నటన!

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి త్వరలో ఓ చిత్రంలో నటించనున్నారని టివి-9 ఓ వార్త ప్రసారం చేసింది. నటనలో ఇప్పటికే రాటుదేలిన వివేకానందరెడ్డి స్టార్‌గా రాణిస్తారని కితాబిస్తూ నగరంలో ఆయన నిత్యం చేసే చిత్రవిచిత్ర చేష్టలను సవివరంగా ప్రసారం చేసింది. ఆయన తానెందుకు నటుడు కావాలనుకొంటున్నదీ టివి-9 విలేకరికి వివరించారు. విలన్ షేడ్ పాత్రలంటే ఇష్టమని సినిమాలోనూ అటువంటి పాత్రలోనే తాను కనపడుతున్నట్లు వివేకా చెప్పుకొచ్చాడు.

## తెలుగుదేశం అభ్యర్థుల ఖరారు

కోవూరు, ఉదయగిరి నియోజకవర్గాలకు ఉప ఎన్నికలు జరుగుతుండడంతో ఈ రెండు చోట్ల తెలుగుదేశం పార్టీ తరపున పోటీచేసే అభ్యర్థులను పార్టీ ప్రకటించింది. కోవూరుకు జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, ఉదయగిరిలో బొల్లినేని రామారావు పోటీచేస్తారని చంద్రబాబు నాయుడు వెల్లడించారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ తరపున మాజీ ఎమ్మెల్యేలు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డిలు పోటీ చేస్తారు. అధికార కాంగ్రెస్ పార్టీ తన అభ్యర్థులను ప్రకటించే విషయంలో మల్లగుల్లాలు పడుతుంది.

## చిరంజీవి రాక!

కాంగ్రెస్ పార్టీ నాయకుడు, మెగా స్టార్ చిరంజీవి 28వ తేది నెల్లూరుకు రానున్నారు. ఆయన చేత నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి సర్వేపల్లి కాలువపై హరనాథపురం, ఆత్మకూరు బస్టాండ్‌లతో పాటు మరో రెండు చోట్ల నిర్మించిన కొత్త వంతెనలను ప్రారంభింపజేస్తారు. స్టోన్‌హౌస్‌పేట రోడ్డు విస్తరణ పనులకు ఆయన చేత శంకుస్థాపన చేయిస్తారు. నెల్లూరులో కాంగ్రెస్ పార్టీకి మద్దతుగా ఒక సభలో మాట్లాడించనున్నట్లు తెలిసింది.

## తెలుగులో ఉర్దూ!

ఉర్దూకు ప్రత్యేక లిపి, భాష ఉన్నాయి. కానీ జిల్లాలోని ప్రభుత్వ పాఠశాలల్లో ఉన్న మున్షీలు ఉర్దూను ఉర్దూలో బోధించక తెలుగులో చెబుతున్నారట. అంటే ఇంటర్‌లో సంస్కృత భాషను తెలుగులో బోధించినట్లుగా ఉర్దూను చెప్పడంపై ఈ భాషాభిమానులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి కూడా తన తనిఖీల్లో ఈ విషయం గమనించినట్లు చెబుతున్నారు. ఈ వ్యవహారంపై చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది.

## కలెక్టర్, ఎస్పీల బంగళాలకు కోతలేదా?

నెల్లూరు పొదలకూరురోడ్డులోని కలెక్టర్, ఎస్పీల బంగళాలకు చీకటి పడ్డాక 6.30 నుంచి 7.30 గంటల వరకు విధిస్తున్న విద్యుత్‌కోత నుంచి ట్రాన్స్‌కో మినహాయించినట్లుంది. కలెక్టర్, ఎస్పీ బంగళాలకు పొదలకూరు రోడ్డులోని విద్యుత్ సబ్‌స్టేషన్‌కు దగ్గరగా ఉండడంతో ఈ ఏర్పాటు చేసినట్లుంది. ఈ రెండు బంగళాలకు ప్రక్కనే ఉన్న కార్పొరేషన్ ఆఫీసు, క్షయాసుపత్రిలోనూ విద్యుత్‌కోత సమయంలో వెలుగులు చిమ్మడాన్ని ఈ వైపు వెళ్తున్న ప్రతిఒక్కరూ గమనిస్తూనే ఉన్నారు.

## ఫైర్!

నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో 45 రోజులుగా దిగ్విజయంగా పాదయాత్ర చేస్తున్న కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డిపై రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి నిప్పులుకక్కారు. శ్రీధర్‌రెడ్డిది చీటింగ్ బ్యాచ్ అని ఆయన గడ్డాలు పెంచుకొని వీధుల వెంట పిచ్చోడిగా తిరుగుతున్నాడని వ్యాఖ్యానించారు.

దీనికి ప్రతిగా 19వ తేది శ్రీధర్ రెడ్డి బట్వాడిపాళెంలో వివేకానందరెడ్డిని తిట్టిపోశాడు. తాను స్వర్గీయ వైఎస్‌రాజశేఖర్‌రెడ్డిపై ఉన్న పిచ్చితో జగన్మోహన్ రెడ్డి వెంట తిరుగుతున్నానని, రాజశేఖర్ రెడ్డి దయ వల్ల పదవులు, అధికారం పొందిన ఆనం సోదరులు మాత్రం ఆయన కుటుంబానికి వెన్నుపోటు పొడిచారన్నారు. మాజీ ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్యను తిట్టిన నోటితోనే ఆయన్ను పొగిడారు. ఇప్పుడేమో కిరణ్ కుమార్‌రెడ్డి మెహర్బానీ కోసం రాజశేఖర్‌రెడ్డి కుటుంబాన్ని విమర్శిస్తున్నారు. మొన్నటి పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికల సమయంలో మేకపాటి రాజమోహన్ రెడ్డిని మా 'పెద్ద' అన్నవారు ఇప్పుడు తిట్టడాన్ని జనం గమనిస్తున్నారన్నారు.

## ఇప్పుడు పోటీచేయం!

తమను ఐదేళ్లు సేవచేయమని ప్రజలు ఎన్నుకొన్నారని ఎవరో పోటీ చేయమంటే ఉపఎన్నికల్లో తాము పోటీ చేయాల్సిన అవసరం లేదని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి 17వ తేది నెల్లూరులో స్పష్టం చేశారు. తమపై ఛాలెంజ్‌లు చేస్తున్న మేకపాటి బ్రదర్స్ 2014లో జరిగే సాధారణ ఎన్నికల్లో తాము పోటీచేసే చోట ప్రత్యర్థులుగా నిలచి సత్తాచాట వచ్చున్నారు. తమది నిబద్ధతగల రాజకీయ కుటుంబమని మేకపాటి సోదరుల్లా కాంట్రాక్టులు, ప్యాకేజీలకు పార్టీలను వదలి వెళ్లమన్నారు.

## రిజిస్ట్రేషన్ల శాఖ ఉద్యోగ సంఘం!

నెల్లూరు రిజిస్ట్రేషన్ శాఖ ఉద్యోగుల సంక్షేమ సంఘం అధ్యక్షునిగా స్టోన్ హౌస్‌పేట రిజిస్ట్రార్ అజయ్‌కుమార్‌రెడ్డి ఎన్నికయ్యారు. కార్యదర్శిగా నెల్లూరు రిజిస్ట్రార్ కార్యాలయంలోని అసిస్టెంట్ రిజిస్ట్రార్ వై.కె.నందకిషోర్, సహకార్యదర్శిగా పి.శ్రీనివాసులు, కోశాధికారిగా జగన్‌మోహన్‌తోపాటు 10 మంది కార్యవర్గసభ్యులను ఎన్నుకొన్నారు. ఈ ఎన్నికలు 18వతేది జిల్లా కోర్టు ప్రాంగణంలోని రిజిస్ట్రార్ ఆఫీసులో జరిగింది.

## పోస్టల్ సూపరింటెండెంట్ బదలీ!

నెల్లూరు పోస్టల్ సూపరింటెండెంట్ దొరైరాజ్ చెన్నైకు బదలీ అయ్యారు. కరీంనగర్ జిల్లా పెద్దపల్లిలో పనిచేస్తున్న డేవిడ్‌ను ఇక్కడకు మార్చారు. డేవిడ్‌గారు నెల్లూరుకు పాతకాపే. గతంలో జిల్లా అసిస్టెంట్ పోస్టల్ సూపరింటెండెంట్‌గా పనిచేశారాయన. దొరైరాజ్ నెల్లూరుకు వచ్చింది మొదలు వెళ్లే వరకు ఆ శాఖలో చేసిన సంస్కరణ ఒకటి కూడా లేకపోవడం విశేషం.

## పెన్షనర్ల దినోత్సవం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ విశ్రాంత ఉద్యోగుల సంఘం నేతృత్వంలో 17వ తేది నెల్లూరు ఎన్జీఓ హోమ్‌లో సీనియర్ సిటిజన్స్ మరియు పెన్షనర్ల దినోత్సవం జరిగింది. జడ్పీ సిఇఓ బి.జయరామయ్య ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఆయన మాట్లాడుతూ పెన్షనర్లు ఆరోగ్యాన్ని కాపాడుకోవాలని, దీనికిగాను ప్రతినిత్యం వ్యాయామం చేయాలన్నారు. ట్రెజరీ డిప్యూటీ డైరక్టర్ నాగమాంబ మాట్లాడుతూ పెన్షనర్లకు ట్రెజరీ నుంచి రావాల్సిన రాయితీలు వచ్చే విధంగా తనవంతు సహకారం అందిస్తానన్నారు. సంఘం కార్యదర్శి లక్ష్మీనారాయణ నివేదిక సమర్పణ అనంతరం 80 ఏళ్లు నిండిన 25 మంది పెన్షనర్లను సన్మానించారు. ఈ కార్యక్రమంలో సంఘం అధ్యక్షుడు నారపుశెట్టి నారాయణ, సహాధ్యక్షులు జయరామరాజు, గోపాలరెడ్డి, వేలూరు శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

## డాక్టర్ సి.రాజశేఖర్‌రెడ్డికి జీవిత సాఫల్య పురస్కారం

చెన్నైలోని విజయ హెల్త్ సెంటర్ డైరక్టర్, చేయితిరిగిన ఆర్థోపెడిక్ సర్జన్ డాక్టర్ చిల్లకూరు రాజశేఖర్‌రెడ్డికి తమిళ

కొరవ 14వ పేజీలో

▶ కలెక్టర్, ఎస్పీలను

# మెచ్చుకున్న ముఖ్యమంత్రి!

**ఇదే తీరును కొనసాగించాలని విజ్ఞప్తి!**



ముఖ్యమంత్రి ప్రశంసలు పొందిన ఎస్పీ, కలెక్టర్.

14, 15 తేదీల్లో హైదరాబాద్‌లో జరిగిన జిల్లా కలెక్టర్లు, ఎస్పీల సమావేశంలో మన జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ బి.వి.రమణకుమార్‌కు ప్రశంసలు లభించడంతోపాటు జిల్లా ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలకు పరిష్కారం లభించింది. జిల్లాలో దెబ్బతినిపోయిన ఆర్ అండ్ బి రోడ్ల మరమ్మత్తులకు ముఖ్యమంత్రి 160 కోట్లు మంజూరు చేశారు. పెన్నావారధి నిర్మాణానికి 68 కోట్ల రూపాయలు అదనపు నిధుల మంజూరుకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. స్వాతంత్ర్యం వచ్చినప్పట్నుంచి నెల్లూరు ప్రజలు కోరుకొంటున్న ప్రభుత్వ యాజమాన్యాన మెడికల్ కాలేజి నిర్వహణకు సైతం జిఓ మంజూరు చేయడం విశేషం. ఈ సమావేశంలో కలెక్టర్ గూడూరు, వెంకటగిరి, కావలి పట్టణాలలో మంచినీటి సమస్య పరిష్కారానికి అదనపు నిధులు, ఇప్పటివరకు జరిగిన పనిని ముఖ్యమంత్రి దృష్టికి తీసుకెళ్లారు. ఈ చర్చ జరుగుతున్న సందర్భంలో రెవిన్యూ మంత్రి రఘువీరారెడ్డి జిల్లాలోని సాంఘిక సంక్షేమ హాస్టళ్లలో కనీస వసతుల కల్పనకు కలెక్టర్ రూపొందించిన స్వీకారం పథకం గూర్చి చెప్పడంతో ముఖ్యమంత్రి కలెక్టర్‌ను మెచ్చుకొన్నారు. రెవిన్యూ సదస్సులు కలెక్టర్ చొరవతో బాగా జరిగాయన్నారు. 15వ తేది జరిగిన ఎస్పీల సమావేశంలో డిజిపి దినేష్‌రెడ్డి ఎస్పీ రమణకుమార్ ప్రారంభించిన ప్రజావిజ్ఞప్తుల దినంపై ప్రశంసల జల్లు కురిపించారు. రాష్ట్రవ్యాప్తంగా ఎస్పీలు ఈ పథకం ప్రారంభిస్తే బాగుంటుందన్నారు. నేర పరిశోధనలోనూ రాష్ట్రంలో నెల్లూరు పోలీసులు రెండవ స్థానంలో నిలచారని డిజిపి అభినందించడంతో ఎస్పీని పోలీసు అధికారులందరూ సమావేశంలో మెచ్చుకొన్నారు. దడబడలు సృష్టించకుండా నిశ్శబ్దంగా పనిచేస్తూ రాష్ట్రస్థాయిలో ప్రశంసలు పొందిన కలెక్టర్, ఎస్పీలు అభినందనీయులు.

# పిల్లల పార్కుపై పెద్దలు శ్రద్ధపెట్టాలి!

చిన్న పిల్లల కోసం ఏర్పాటుచేసిన పార్కు పెద్దల పెత్తనం వల్ల నామరూపాలు లేకుండా పోయింది. ఎంతో సుందరంగా దాతల సహకారంతో తీర్చిదిద్దిన పార్కు నేడు శిథిలమై రూపురేఖలు కోల్పోయి కళా విహీనంగా మారింది. దీనికి కారణాలను పరిశీలిస్తే నిర్వాహకుల నిర్లక్ష్యమన్నది స్పష్టం అవుతుంది. 2003లో ఏడు ఎకరాల విస్తీర్ణంలో ఆహ్లాదకరమైన వాతావరణంలో ఈ పార్కును పిల్లల కోసం తీర్చిదిద్దారు. ఆనాటి కలెక్టర్ శ్రీలక్ష్మి చొరవతో జెఎస్‌రెడ్డి దాతృత్వంతో జన్మభూమి పథకం క్రింద రూపుదిద్దుకొంది. మ్యూజికల్ ఫౌంటేన్, జైంట్ వీల్, రైలు వంటి ఆట వస్తువులు ఏర్పాటు చేశారు. ఈ పార్కు నిర్వహణా బాధ్యతలను తమాషా ఎంటర్ ప్రైజెస్ లిమిటెడ్ చేపట్టింది. మొదట్లో బాగానే ఉన్నా రానురాను పార్కు నిర్వహణ ఘోరంగా తయా



పచ్చదనం కరువైన పిల్లల పార్కు.

రయ్యింది. నిర్వాహకులకు డబ్బులు వసూలు చేయడంపై పెట్టిన శ్రద్ధ పార్కును పచ్చగా, ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉంచడంపై పెట్టకపోవడంతో కొద్దికాలానికే పార్కు పాడై పోయింది. ఎక్కడికక్కడ ఆట వస్తువులు మరమ్మత్తులకు గురయ్యాయి. వీటి బాగోగులు పట్టించుకోకపోవడంతో తుప్పు పట్టి పనికిరాకుండా పోయాయి. ఎంతో ప్రతిష్టాత్మకంగా ఏర్పాటుచేసిన మ్యూజికల్ ఫౌంటేన్ నిరుపయోగంగా మారింది. లైట్లు పగిలిపోయి, బెంచీలు విరిగిపోయి, పచ్చని గడ్డి కాస్త ఎండిపోయి ముళ్లపొదలతో కళావిహీనంగా మారి నగరాన్ని ఎగతాళి చేస్తున్నట్లు మారింది. నిర్వాహకులపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అయ్యాయి. పలువురు పుర ప్రముఖులు, వాకర్స్ అసోసియేషన్ వారు ఆందోళనకు దిగారు. ఈ పరిస్థితుల్లో పార్కు నిర్వహణపై కోర్టుకు వెళ్లిన తమాషా ఎంటర్ ప్రైజెస్‌కు చుక్కెదురైంది. ఇకనైనా అధికారులు జోక్యం చేసుకొని పార్కుకు పూర్వ ప్రభావం తీసుకురావాలని పలువురు కోరుకొంటున్నారు.

# రూ. 15కే భోజనం!

**నెల్లూరులో ఎందరో ఆకలి తీరుస్తున్న ఆదినారాయణ**



కిటకిటలాడుతున్న ఆదినారాయణ నిర్వహిస్తున్న భోజనశాల.

భోజనం రేట్లు అధికమవుతున్న తరుణంలో కేవలం 15 రూపాయలకే పోషకాలతో కూడుకున్న ఆహారాన్ని అందిస్తూ పలువురి ఆకలి తీరుస్తూ ఆదర్శవంతంగా నిలుస్తున్నాడు. వెంకట సుబ్బయ్య ఆహార ట్రస్టు నిర్వాహకుడు సుంకర ఆదినారాయణ. ఆశయం గొప్పదైతే ఎన్ని కష్టనష్టాలొచ్చినా అనుకొన్న దానిని ఆచరించి చూపొచ్చని నిరూపిస్తున్నాడాయన. బాలాజీనగర్ అన్నపూర్ణ అపార్ట్‌మెంట్ సమీపంలో ఆయన ఈ భోజనశాలను నిర్వహిస్తుండడం విశేషం. ఆదినారాయణ అంటే ఠపీమని గుర్తుపట్టకపోయినా 15 రూపాయలకు భోజనం పెట్టే వ్యక్తంటే మాత్రం అందరూ ఇట్టే గుర్తిస్తారు. దామరమడుగుకు చెందిన ఆదినారాయణ చాలా కాలంగా నగరంలో వివిధ షాపుల్లో పనిచేస్తూ బయట హోటల్‌కెళ్లి అధిక ధరలు పెట్టి భోజనం చేయలేక, బిస్కెట్లు తిని టీ తాగి అర్ధాకలితో ఉంటున్న వారిని చూసి తక్కువ ధరకు భోజనం పెట్టాలన్న ఆలోచన వచ్చిందంటారు. మామూలు ఆహారం కాకుండా కాస్తంత పోషక విలువలతో కూడిన ఆహారాన్ని తక్కువ ధరకు పెట్టాలని భావించిన ఆయన అనుకున్నదే తడువుగా తన కుటుంబ సభ్యులతో కలసి స్వగ్రామం వెళ్లి అక్కడ కూరగాయలు సాగు చేపట్టాడు. వర్మి కంపోస్టు ఎరువులతో వాటిని పండించడమేకాక, సేంద్రీయ ఎరువులతో పండించిన వారి వద్ద ధాన్యాన్ని కొనుగోలుచేసి వాటితో ఆహారాన్ని తయారు చేస్తున్నాడు. ధర తక్కువని శుచి శుభ్రత విషయంలో ఎక్కడా రాజీ పడకుండా మొలగొలుకుల బియ్యంతో కూడిన అన్నాన్ని, కూరలను భోజనంగా పెడుతున్నాడు. మాంసాహారులకు కొదవ లేకుండా 25 రూపాయలుకే మాంసాహార భోజనాన్ని అందిస్తుండడం విశేషం. ఆహారం తయారీకి బెంగుళూరు తదితర ప్రాంతాలను పరిశీలించి ఒకేసారి 1600 మందికి పైగా భోజనం తయారు చేసేందుకు వీలైన సామర్థ్యంగల వంట పాత్రలను కొనుగోలు చేశాడు. కట్టెలు, గ్యాస్‌పై ఆహారం తయారు చేయకుండా ఆవిరితో వండడం ఆయన ప్రత్యేకత. లాభాపేక్ష లేకుండా పలువురి ఆకలి తీర్చడం కంటే ఆనందం ఏముంటుందని చెప్తున్న ఆదినారాయణ చేస్తున్న సేవ నిజంగా అభినందనీయం. దామరమడుగు నుంచి తయారుచేసి తీసుకవచ్చిన ఆహారం మధ్యాహ్నం 12 గంటల నుంచి 3 గంటల వరకు అందుబాటులో ఉంటుంది. ప్రస్తుతం పలు ప్రాంతాల నుంచి రోజుకు 2వేల మంది వరకు వచ్చి తమ వద్ద భోజనం చేస్తుంటారని చెప్తున్న ఆదినారాయణ త్వరలో అయ్యప్పగుడి వద్ద బ్రాంచిని ఏర్పాటుచేసి ఆ ప్రాంత వాసులకు పోషకాహారాన్ని తక్కువ ధరకు అందించాలనే ప్రయత్నంలో ఉన్నాడు. తన తండ్రి వెంకటసుబ్బయ్య పేరున ఏర్పాటుచేసిన ఈ ట్రస్టును పాత కలెక్టర్ రాంగోపాల్ ప్రారంభించారు. ఇప్పుడు వెతుక్కుని మరీ అక్కడకు వెళ్లి భోజనంచేసి వస్తున్నారంటే ఎంత రుచి, శుచిగా వుందో అర్థం చేసుకోవచ్చు.

# విద్యాశాఖ దొంగాట!

గుర్తింపులేని పాఠశాలలపై చర్యలు చేపట్టడంలో విద్యాశాఖ అధికారులు సాచివేత ధోరణిని అవలంభిస్తుండడం ఇటు గుర్తింపు లేకపోయినా అట్టహాసంగా పాఠశాలలు నడుపుతున్న విద్యాసంస్థల మధ్య తల్లితండ్రులు, విద్యార్థులు నలిగిపోతున్నారు. సంస్థకున్న పేరు ప్రఖ్యాతులు బట్టి ఆయా పాఠశాలల్లో చేర్పించిన విద్యార్థులకు అవి గుర్తింపులేనివని తెలిసినా వేరే పాఠశాలలకు వెళ్లలేని పరిస్థితులు నెల కొంటున్నాయి. విద్యా సంవత్సరం ప్రారంభం నాడే గుర్తింపులేని పాఠశాలల వ్యవహారంపై కఠిన చర్యలు తీసుకోవాల్సిన విద్యాశాఖ ఆ దిశగా అడుగులు వేయకపోవడం, లోపాయికారి ఒప్పందం కుదుర్చుకోవడంతో ఈ వివాదం కొనసాగుతూనే ఉంది. గుర్తింపులేని పాఠశాలల యాజమాన్యాలపై క్రిమినల్ కేసులు పెడతామని హెచ్చరించినా కొందరు నేతల అండదండలుండడంతో చర్యలు చేపట్టేందుకు విద్యాశాఖ ముందుకు రావడం లేదు. షుమారు వందకు పైగా పాఠశాలలు గుర్తింపులేనివని ప్రకటించినా దేనిపైనా కఠినచర్యలు తీసుకొన్న దాఖలాలు లేవు. తమవి పాఠశాలలు కాదు ట్యుటోరియల్స్ మాత్రమేనని విద్యాశాఖను నమ్మించే యత్నం చేసిన గుర్తింపులేని పాఠశాలల యాజమాన్యాలు తిరిగి విద్యాశాఖకు తమ గుర్తింపు ఇవ్వాలని దరఖాస్తు పెట్టుకొని ఉండడం విశేషం. మరోవైపు కొన్ని గుర్తింపు ఉండి పిల్లలులేని పాఠ



వివాదాల్లో డిఇఓ కార్యాలయం.

శాలల పేరుతో గుర్తింపులేని పాఠశాల విద్యార్థులను పరీక్షలకు పంపుతుండడంతో ఈ వ్యాపారం బ్రహ్మాండంగా నడుస్తోంది. ఒక్కో పిల్లవాడికి ఇంత మొత్తం అని చెల్లించి ఆయా విద్యాసంస్థలు గుర్తింపుగల స్కూల్ నుంచి ఆ పాఠశాల విద్యార్థుల మాదిరిగా పరీక్షలు వ్రాయిస్తుండడంతో అధికారులకు తెలిసినా ఏమీ చేయలేకపోతున్నారు. ఈ విద్యా సంవత్సరం కొద్ది నెలల్లో ముగుస్తున్నా మార్చిలో పరీక్షలకు పిల్లలు హాజరు కాబోతున్నారు. ఇప్పటికైనా విద్యాశాఖ అధికారులు గట్టి చర్యలు చేపట్టాలని పలువురు విద్యార్థుల తల్లితండ్రులు కోరుకొంటున్నారు.

## శారదాదేవి జయంతి

శ్రీరామకృష్ణ పరమహంస వారి సతీమణి దివ్యజనని మాతృశ్రీ శారదాదేవి 159వ జయంతి 17వ తేది శ్రీరామకృష్ణ సేవా సమితి ఆధ్వర్యంలో ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా మూలపేటలోని శ్రీకృష్ణ ధర్మరాజస్వామి ఆలయంలో అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమం సేవాసమితి ఉపాధ్యక్షులు కొండా బలరామిరెడ్డి, వ్యవస్థాపక కార్యదర్శి ఎస్వీ నరసింహారావు, కార్యదర్శి జి.జయచంద్ర, కార్యవర్గ సభ్యులు సి.మాలకొండయ్య, టి.లక్ష్మీనారాయణరావు పాల్గొన్నారు.

# ఉనికిని కోల్పోయిన రైతుబజార్లు!

**11 యేళ్ల క్రితం నగరంలోని ఫత్తేఖాన్‌పేట, నవాబుపేట ప్రాంతాల్లో పెట్టిన రైతుబజార్లు నిరుపయోగంగా మారాయి. వీటిని తిరిగి వినియోగంలోనికి తెచ్చేందుకు మార్కెటింగ్ శాఖాధికారులతోపాటు జిల్లా కలెక్టర్ ప్రత్యేక శ్రద్ధ చూపించాల్సి ఉంది.**

లక్షలాది రూపాయల వ్యయంతో నిర్మించిన రైతుబజార్లు నేడు వినియోగంలో లేకుండాపోయాయి. అధికారుల నిర్లక్ష్యం, ప్రజాప్రతినిధుల ఉదాసీనత కారణంగా రైతుబజార్లు వునికిని కోల్పోయాయి. గ్రామీణప్రాంతాల్లో రైతులు పండించిన వివిధ రకాల కూరగాయలు, ఆకుకూరలు విక్రయించేందుకు అనువుగా వుంటుందన్న ఉద్దేశ్యంతో అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం 2000సంవత్సరంలో నగరంలో రెండు ప్రాంతాల్లో రైతుబజార్లు ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. నగరంలోని ఫత్తేఖాన్‌పేట, నవాబుపేట ప్రాంతాల్లో రైతుబజార్లు నిర్మించారు. ఒక్కో రైతు బజారులో 50 షాపులు వుండే విధంగా నిర్మాణాలు చేపట్టారు.

వీటిని ప్రారంభించిన తొలిదినాల్లో కళకళలాడుతూ కనిపించాయి. తర్వాత ఇక్కడ మౌలిక సదుపాయాలు లోపించడం వల్ల వ్యాపారాలు బాగా తగ్గుముఖం పడ్డాయి. రైతులు కూడా తాము పండించిన కూరగాయలు, ఆకు కూరలను ఎసి కూరగాయల మార్కెట్ వద్దకు తీసుకెళ్లి విక్రయించుకుంటున్నారు. దీంతో రెండు ప్రాంతాల్లో వున్న రైతుబజార్లు శిథిలావస్థకు చేరుకున్నాయి. ప్రస్తుతం ఫత్తేఖాన్‌పేట రైతుబజార్లో బియ్యం మాత్రమే విక్రయిస్తున్నారు. మిగిలిన షాపులన్ని కూడా మూతవేసి వున్నారు. నగర వాసులకు ఎంతో ఉపయోగకరంగానూ, దగ్గరగానూ వుండాలన్న లక్ష్యంతో నిర్మించిన రైతుబజార్లు ఉపయోగం లేకుండా పోవడం బాధాకరం.

ఎసి కూరగాయల మార్కెట్లో అధిక ధరలకు కూరగాయలు విక్రయిస్తుంటారు. అయినా కూడా తప్పనిసరి పరిస్థితుల్లో కొనుగోలు చేయక తప్పడం లేదు. లక్షలు వ్యయం చేసి నిర్మించిన రైతు బజార్ల గురించి అధికారులు పట్టించుకోకపోవడంపై ప్రజలు అగ్రహం వ్యక్తం చేస్తున్నారు. మరో ప్రక్క గ్రామీణ ప్రాంతాల్లో కూరగాయలు, ఆకుకూరలు పండించే చిన్న, సన్నకారురైతులు సైతం అధికారుల తీరును విమర్శిస్తున్నారు. కూరగాయలు విక్రయించుకునేందుకు షెల్టర్ లేకపోవడంతో రోడ్లప్రక్కన వ్యాపారం చేసుకోవాల్సిన దుస్థితి ఏర్పడిందని వాపోతున్నారు.

ఈ క్రమంలో రాకపోకలకు అంతరాయం కలిగిస్తున్నారంటూ ఎసి కూరగాయల మార్కెట్ పరిసరాల్లో కూరగాయల బుట్టలు పెట్టుకొన్నవారిని పోలీసులు దుర్భాషలాడుతుంటారు. కుటుంబ పోషణ నిమిత్తం పోలీసుల తిట్లను మౌనంగా భరిస్తున్నామని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ప్రస్తుతం రైతుబజార్లలో వ్యాపారాలు కొనసాగక పోవడంతో రాత్రి వేళ చీకటి కార్యకలాపాలకు నిలయంగా మారుతున్నాయి. కొంతమంది ఆకతాయిలు ఇక్కడ పగలు పేకాటాడడం, రాత్రి సమయంలో మద్యం సేవించడం వంటి చర్యలకు పాల్పడుతున్నారు. రాత్రి సమయంలో రైతుబజార్లవైపు నడిచి వెళ్లాలంటేనే ప్రజలు భయాందోళన చెందుతున్నారు. ప్రధానంగా మహిళల పరిస్థితి ఇబ్బందికరంగా మారింది.

రైతులకు లబ్ది చేకూర్చాలన్న ప్రభుత్వ సంకల్పం అధికారుల నిర్లక్ష్యం కారణంగా నెరవేరకుండా పోయింది. ఇప్పటికైనా సంబంధితశాఖ అధికారులతోపాటు జిల్లా కలెక్టర్ స్పందించి నిరుపయోగంగా వున్న రైతుబజార్లను తిరిగి పున: ప్రారంభించేందుకు అన్ని చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.



నిర్మానుష్యంగా ఫత్తేఖాన్‌పేట రైతుబజారు.




నవాబుపేట రైతుబజారు దగ్గర జనమే కానరారు.




సింహపురి సుస్వరాల నేతృత్వంలో జ్ఞాననేత్ర అంధుల స్వచ్ఛంద సేవా సంస్థ సభ్యులు టౌన్‌హాల్‌లో నిర్వహించిన సంగీత విభావరిలో 25వేల రూపాయల విరాళాన్ని సంస్థ నిర్వాహకులకు అందజేస్తున్న మాడరన్ స్కూల్ వాకాటి విజయకుమార్‌రెడ్డి. ప్రక్కన ఎస్‌ఆర్‌కె స్కూల్ కృష్ణమూర్తి, మైథిలి స్కూల్ మనోహర్‌రెడ్డి, హజరత్‌బాబు, బి.వి.నరసింహం.

# ధ్వంసమైపోయిన కలువాయి రోడ్లు!

## రాకపోకలకు తీవ్ర ఇబ్బంది



కలువాయి నుంచి వివిధ ప్రాంతాలకు వెళ్లే రోడ్లు పూర్తిగా ధ్వంసమైపోవడంతో రాకపోకలకు తీవ్ర ఆటంకం ఏర్పడుతోంది. ఇక్కడ నుంచి సోమశిల, పెంచలకోన, పొదలకూరు, చేజర్లకు వెళ్లే రోడ్లు మరీ అధ్వాన్నంగా వున్నాయి. అసలే దెబ్బతిని వున్న రోడ్లు ఇటీవల కురిసిన వర్షాలకు మరింతంగా పాడైపోవడంతో ఈ మార్గాల గుండా ప్రయాణించేవారు పలు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. ముఖ్యంగా పర్యాటక కేంద్రమైన సోమశిలకు వెళ్లే రోడ్డు నరకాన్ని తలపిస్తోంది. రెండు కోట్ల రూపాయలతో సోమశిలను పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దుతున్నప్పటికీ రోడ్ల బాగోగులు పట్టించుకోకపోవడంతో పలు ప్రాంతాల నుంచి ఇక్కడకు వచ్చే ప్రజలు అధ్వాన్నంగా వున్న రోడ్లపై ప్రయాణించలేక పోతున్నామని వాపోతున్నారు. పుణ్యక్షేత్రమైన పెంచలకోనకు వెళ్లే రోడ్డు రూపురేఖలు కోల్పోయి వుంది. కలువాయి నుంచి కుల్లూరు మీదుగా వెళ్లే పెంచలకోన, రాపూరు రోడ్డు, చేజర్ల, పొదలకూరు వెళ్లే రహదారులు గుంటలు పడి వాహనాలు ప్రమాదాలకు గురి అవుతున్నాయి. పలువురు పట్టుతప్పి వాహనాలపై నుంచి పడి ఆస్పత్రి పాలవుతున్నారు. ఈ మార్గం గుండా పలువురు ప్రజాప్రతినిధులు, రాష్ట్ర రాజకీయాల్లో చక్రం తిప్పే నేతలు నిత్యం తిరుగుతున్నా రోడ్ల మరమ్మత్తుల గురించి పట్టించుకోకపోవడం విమర్శలపాలవుతుంది. మరోవైపు అధికారులు, కాంట్రాక్టర్లకు మాత్రం దెబ్బతిన్న రోడ్లు కాసులు కురిపిస్తున్నాయి. మరమ్మత్తుల పేరుతో తూతూ మంత్రంగా పనులు చేసి అధిక మొత్తం జేబుల్లో నింపుకొంటుండడం, ఆ రోడ్లు కొద్దిరోజులకే తిరిగి యథాస్థితికి చేరుకొంటుండడంతో ఈ ప్రాంత ప్రజలు నరకాన్ని చవి చూస్తున్నారు.

● అసెంబ్లీని తాకిన

# గూడూరు రాజకీయ సెగ!



గూడూరు నియోజకవర్గంలో టిడిపికి చెందిన స్థానిక శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్‌కు, కాంగ్రెస్ పార్టీ నియోజకవర్గ ఇన్‌ఛార్జి పనబాక కృష్ణయ్యకు మధ్య గత కొంతకాలంగా వివాదం నెలకొని వుంది. ప్రభుత్వ కార్యక్రమాలకు పనబాక కృష్ణయ్య హాజరుకావడం, అభివృద్ధి పనుల గురించి మాట్లాడుతుండడంపై ఇరువురి మధ్య తీవ్ర స్థాయిలో విబేధాలు నెలకొని వున్నాయి. ఎమ్మెల్యే దుర్గాప్రసాద్ అధికారుల తీరును తప్పుబడుతూ బహిరంగ వ్యాఖ్యలు చేసిన నేపథ్యంలో గూడూరు వ్యవహారం శాసనసభ సమావేశాల్లో చర్చకు రావడం సమస్య తీవ్రతను తెలియజెప్పింది. మాజీ ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నేత చంద్రబాబునాయుడు ఈ అంశంపై

## తనను పట్టించుకోవడం లేదని దుర్గాప్రసాద్ ఆవేదన

సభలో మాట్లాడారు. ఎన్నికలలో ఓటమి పాలైన వ్యక్తి అన్ని ప్రభుత్వ కార్యక్రమాలలో పాల్గొంటూ స్థానిక శాసనసభ్యుడిని అవమానపరచే విధంగా ప్రవర్తిస్తున్నారని స్పీకర్ దృష్టికి తీసుకొని వచ్చారు. శాసనసభ్యుడికి ఇలా జరగడం గర్హనీయమని తీవ్రంగా స్పందించారు చంద్రబాబు. అయితే చంద్రబాబు ఆక్షేపణను ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఖండించారు. ప్రభుత్వ కార్యక్రమాలలో కాంగ్రెస్‌పార్టీ తరపున ఆ ప్రాంత నియోజకవర్గ నేత పాల్గొంటే తప్పేమీలేదని సమర్థించడంతో ఈ అంశంపై వాదోపవాదాలు జరిగాయి. మొత్తంమీద బల్లి, పనబాక వివాదం అసెంబ్లీని తాకడం చర్చనీయాంశమయ్యింది.

● దుస్థితిలో

# వెంకటగిరి రైల్వే స్టేషన్ రోడ్డు!

వెంకటగిరి పట్టణం రైల్వేస్టేషన్ ముందు గల రోడ్డు దారుణంగా దెబ్బతిని పోయింది. గుంటలు మిట్టలు ఏర్పడి రాకపోకలకు తీవ్ర అంతరాయంగా వుంది. రైల్వేస్టేషన్‌కు వచ్చే ప్రయాణికులు, వాహనాలు నిత్యం వేలాదిగా ఈ రోడ్డుపై ప్రయాణిస్తుంటాయి. ఆటోలు, అధిక సంఖ్యలో తిరుగుతుంటాయి. అసలే అంతంత మాత్రంగా వున్న రోడ్డు వాహనాల రాకపోకలతో మరింత అధ్వాన్నంగా తయారైంది. మరమ్మత్తులు చేపట్టిన కొద్దిరోజులకే తిరిగి యథాస్థితికి

## రాకపోకలకు అంతరాయం.

చేరుకుంటుండడంతో శాశ్వత ప్రాతిపదికన సిమెంటు రోడ్డు నిర్మించాలని స్థానికులు కోరుకొంటున్నారు. ఈ రోడ్డులోనే కేంద్రీయ విద్యాలయం వుంది. అందువలన విద్యార్థులు, ప్రయాణీకుల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకొని రోడ్డును నిర్మించాలని పలువురు కోరుతున్నారు. అలాగే బాలాయపల్లి మండలం వెండోడు రైల్వేస్టేషన్ గేటుకు ఇరువైపులా అప్రోచ్‌రోడ్డు పనులను రైల్వేశాఖ 20లక్షలతో చేపట్టింది. నిర్మాణం నాసిరకంగా జరుగుతుండడంపై విమర్శలు వ్యక్తమవుతున్నాయి. కంకర తప్ప సిమెంట్ జాడలు కన్పించడం లేదని పలువురు ఫిర్యాదు చేస్తున్నారు.

## కలెక్టరుకు ఎదురు ప్రశ్న!

జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి నెల్లూరు నగరంలో జరిగే అవకతవకలపై పెద్దగా దృష్టి కేంద్రీకరించకపోయినా మిగతాచోట్ల మాత్రం విస్తృతంగా పర్యటిస్తారు. వివరంగా అన్ని విషయాలు పరిశీలించి ఆదేశాలు జారీ చేస్తుంటారు. 18తేది గూడూరు డివిజన్‌లోని కొమ్మనేటూరు గ్రామానికి వెళ్లిన కలెక్టర్ వృద్ధుడైన దిన కూలీ రమణయ్య ఇంటికి వెళ్లి వారిని ఆప్యాయంగా పలుకరించారు. వాళ్లు సంశయించినా అడిగిమరీ సంగటి ముద్ద పెట్టించుకొని మధ్యాహ్న భోజనం ముగించారు. ఆయన ఇంటి వరండాలో గుమిగూడిన స్థానికులను సమస్యల గూర్చి చెప్పమన్నారు. మరీ అమాయకులైన మహిళలు గతంలో కూడా ఎంతోమంది అధికారులు వచ్చి ఇలానే అడిగివెళ్లారు... చేసిందేమీ లేదనేసరికి కలెక్టర్ గారు ముందు బిత్తరపోయారు. ఆ తర్వాత ఆయన నేను అలాంటి వాడిని కాదు... నమ్మండని ప్రజలకు వివరణ ఇచ్చి సమస్యలన్నింటిని వ్రాసుకొచ్చారు. చూడాలి వీటిని ఏం చేస్తారో?

# విద్యారంగం నిర్వీర్యం

## యుటిఎఫ్ జిల్లా అధ్యక్షుడు శ్రీహరి విమర్శ

విద్యారంగాన్ని ప్రభుత్వాలు నిర్వీర్యం చేస్తున్నాయని యుటిఎఫ్ జిల్లా అధ్యక్షుడు శ్రీహరి విమర్శించారు. వెంకటగిరిలో ఇటీవల జరిగిన యుటిఎఫ్ ప్రాంతీయ కమిటి సమావేశానికి ఆయన ముఖ్యఅతిధిగా హాజరై మాట్లాడారు. డిపిపి సర్వేలో పదేళ్ల క్రితం 83శాతం ప్రభుత్వ పాఠశాలల్లో, 17శాతం ప్రైవేట్ పాఠశాలల్లో చదువుతున్నారని తేలిందని, ఇప్పుడు 40 శాతానికి పైగా ప్రైవేట్ పాఠశాలల్లో చదువుతున్నారని తెలిపారు. ఒక వైపు టీచర్లు లేని బడులు వుంటుండగా, మరోవైపు ఒకరిద్దరితో నడుస్తున్న పాఠశాలలు వున్నాయన్నారు. నేడు రాష్ట్రంలో 750 కస్తూరిబాగాంధీ పాఠశాలలు, 10 మోడల్ స్కూళ్లు వస్తున్నాయన్నారు. పలు విభాగాల అభివృద్ధి అంటూ శిక్షణల పేరుతో ఉపాధ్యాయులపై అదనపు భారం మోపుతున్న ప్రభుత్వం, అధికారులు వాటిని అభివృద్ధి చేయకనే మరో అంశంపై శిక్షణనిస్తూ ఆ పేరుతో వేలకోట్లు ఖర్చుపెడుతున్నారని వ్యాఖ్యానించారు. విద్యారంగాన్ని కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రతిఒక్కరిపై వుందన్నారు. వెంకటగిరి, డక్కిలి, బాలాయపల్లి మండలాలకు చెందిన ఉపాధ్యాయులు పాల్గొన్న ఈ సమావేశంలో సంఘనేతలు పరంధామయ్య, గోపాల్, కుమారస్వామి, కరుణాకర్, సుబ్రహ్మణ్యం, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.



# నేనే గెలుస్తా!

## కోవూరులో ఊదరగొడుతున్న ప్రసన్న

కోవూరు నియోజకవర్గానికి త్వరలో జరగనున్న ఉప ఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ విజయం తథ్యమని ఆ పార్టీ అభ్యర్థి, మాజీ శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి ధీమా వ్యక్తం చేశారు. ఇంటింటా ఎన్నికల ప్రచారం చేపట్టిన ప్రసన్న ప్రజలను కలుసుకొని ఉప ఎన్నికల్లో తనను గెలిపించాల్సిందిగా అభ్యర్థించాడు. ఈ సందర్భంగా ఆయన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పాలనలో పేద ప్రజలకు జరిగిన అభివృద్ధిని, ఆయన ప్రవేశపెట్టిన జనరంజక పథకాలను గుర్తు చేశారు. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నుంచి పోటీ చేస్తున్న తనను ఓడించేందుకు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రజల్లో వైఎస్ పట్ల వున్న కృతజ్ఞతాభావం విజయం సాధించి పెడుతుందన్నారు. పట్టణంలోని పాటూరు రోడ్డు, కాపువీధి, అత్తిపల్లివారి వీధి తదితర ప్రాంతాల్లో ఉద్యోగులను, వ్యాపారులను కలుసుకొని ఎన్నికలలో సహకరించాలని కోరారు. అనంతరం ఆయన కొడవలూరు మండలంలో పర్యటించారు. పద్మనాభసత్రం గ్రామంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తలతో సమావేశం అయ్యారు. మునిసిపాల్టీలు ప్రత్యేకాధికారుల పాలనలో అస్తవ్యస్తంగా తయారయ్యాయని విమర్శించారు. పారిశుధ్యం క్షీణించి అంటు రోగాలు ప్రబలుతున్నా పట్టించుకొనే దిక్కే లేకుండా పోయిందన్నారు. రాష్ట్ర ప్రభుత్వం తక్షణం స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించాలని డిమాండ్ చేశారు.

# దడ పుట్టిస్తున్న తెగుళ్లు!

● నాశనమైన మినుము పంట

మినుముపంట సాగుచేసే రైతాంగాన్ని తెగుళ్లు అతలాకుతలం చేస్తున్నాయి. వేలాది ఎకరాల్లో మినుము వేసిన రైతులకు ఖర్చులు తడిసిమోపెడవుతుండగా మరోవైపు తెగుళ్లు రైతులను ఆందోళనకు గురి చేస్తున్నాయి. జిల్లాలో దాదాపు 34వేల హెక్టార్లలో మినుము పంట సాగు చేస్తున్నారు. ఉదయగిరిలో 6,100 హెక్టార్లు, వింజమూరులో 10వేల హెక్టార్లు, ఆత్మకూరులో 3,576, పొదలకూరులో 8,460, వెంకటగిరిలో 4,525, గూడూరులో 3,145 వేల హెక్టార్లలో వేసిన మినుము పంటకు పల్లాకు తెగులు సోకడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. ఒక్క ఎకరాకు 5 వేల నుంచి 10వేల వరకు పెట్టుబడులు పెట్టిన తమకు ఈ తెగుళ్ల వలన తీవ్ర నష్టం సంభవిస్తున్నదని ఆవేదన చెందుతున్నారు రైతులు. మినుము పంట వేసిన రైతుల తోపాటు బత్తాయి సాగు చేస్తున్న రైతులకు తెగుళ్ల తాకిడి దెబ్బతిస్తోంది. ఈ తెగుళ్ల కారణంగా బత్తాయిలో ఎకరాకు 10 టన్నుల దిగుబడి రావాల్సి వుండగా నాలుగోవంతు కూడా రాక కౌలు పైకం చెల్లించలేని పరిస్థితులు నెలకొంటున్నాయని వాపోతున్నారు. సంగం మండలంతోపాటు కొరిమెర్ల, నీలాయపాళెం, వీర్లగుడిపాడు, మర్రిపాడు, వంగల్లు, జంగుల దొరువు గ్రామాలలో 700 ఎకరాలు బత్తాయి సాగు చేపట్టిన రైతాంగం నష్టాల బారిన పడుతున్నారు.



చిట్రగుంటలోని ఆంధ్రాబ్యాంకులో జరిగిన పెన్షనర్ల దినోత్సవంలో మాట్లాడుతున్న వినియోగదారుల సంఘం అధ్యక్షుడు పి.గోవిందరాజులు. బ్యాంక్ మేనేజర్ ఎ.అనిల్‌కుమార్, పెన్షనర్లు చిత్రంలో వున్నారు.

## మొలకెత్తని విత్తనాలు

పంటసాగు చేసేందుకు వేసిన శనగ విత్తనాలు మొలకెత్తకపోవడంతో అన్నదాతలు ఆందోళన చెందుతున్నారు. జిల్లావ్యాప్తంగా పలు ప్రాంతాలలో రైతుల పరిస్థితి ఇలాగే వుంది. ముఖ్యంగా వింజమూరు మండలంలో 375 ఎకరాల్లో వేసిన పచ్చి శనగ విత్తనాలు మొలకెత్తక పోవడంతో రైతులు అప్పుల్లో కూరుకపోతున్నారు. వింజమూరు, రావిపాడు, నల్లగుంట్ల, శంకవరం, గుండెమడకల గ్రామాల్లో వెయ్యి ఎకరాలకుపైగా పచ్చిశనగ పంట సాగు చేస్తే 375 ఎకరాల్లో అసలు మొలకలే రాలేదట. ఎకరాకు 20 వేలకు పైగా పెట్టుబడులు పెట్టి నష్టపోయామని వాపోతున్నారు రైతులు. తిరిగి విత్తనాలు కొనుగోలు చేయాలంటే అధిక భారం పడుతున్నదని రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. మెట్టప్రాంతమైనందున తమను జిల్లా కలెక్టర్ ఆదుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నారు రైతులు

● నాయుడుపేటలో

# టూ ఇన్ వన్ పాఠశాల!

పగలు ప్రభుత్వ పాఠశాల - రాత్రి ప్రైవేటు పాఠశాల

పగలు ప్రభుత్వ పాఠశాల సాయంత్రం ప్రైవేట్ పాఠశాలగా మారుతుండడం చూసేవారికి, విన్నవారికి ఆశ్చర్యం కల్గిస్తున్నప్పటికి ఇది నిజంగా నిజం. ఈ డబుల్ యాక్షన్ సీన్ జరుగుతున్నది నాయుడుపేటలో కావడం మరింత ఆశ్చర్యం గొలిపే విషయం. ఊరు నడిబొడ్డులో వున్న ఈ పాఠశాలలో ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు ప్రాథమిక విద్యనభ్యసించారట. అందుకు గుర్తుగా ఆ పాఠశాలకు ప్రకాశం పంతులు ప్రాథమిక పాఠశాలగా నామకరణం చేశారు. ఇంత ఘన చరిత్ర వున్న ప్రభుత్వ పాఠశాల నేడు ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లోకి పోవడం ఆశ్చర్యం కల్గిస్తోంది. అక్కడే కొత్తగా ఏర్పాటు చేసిన రవీంద్రభారతి అనే కార్పొరేట్ పాఠశాలకు సాయంత్రం పూట ఈ స్కూలును బాడుగకు ఇవ్వడం చర్చనీయాంశమయ్యింది. మండల విద్యాధికారి, పాఠశాల ప్రధానోపాధ్యాయుడు మరికొందరు ప్రైవేట్ పాఠశాల యజమాన్యంతో కుమ్మక్కై పాఠశాల మూసిన తర్వాత ప్రైవేట్ వ్యక్తులు నిర్వహించుకొనేలా రహస్య ఒప్పందం చేసుకొన్నారట. ఈ వ్యవహారంపై పెద్దఎత్తున డబ్బులు చేతులు మారినట్లు సమాచారం. ప్రభుత్వ స్కూలు ముగియగానే ప్రైవేటు వ్యక్తులు రంగప్రవేశం చేసి తమ పిల్లలకు ఏంచక్కా పాఠాలు బోధిస్తుండడంతో పట్టణ ప్రజలు ఆశ్చర్యంతో నోరెళ్లబెడుతున్నారు. అధికారులు, ఉపాధ్యాయులు అనధికారంగా, నిబంధనలకు విరుద్ధంగా ప్రైవేట్ వ్యక్తులకు పాఠశాలను అప్పగించడంపై సర్వత్రా నిరసన వ్యక్తం అవుతోంది. ఇంతగా బరి తెగించి వ్యవహరిస్తున్న వారిపై విద్యాశాఖ అధికారులు తగిన చర్యలు చేపట్టాలని, ప్రభుత్వ పాఠశాలను కాపాడాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# ఎన్నికల సందడి!

## కోవూరులో ప్రసన్న - సోమిరెడ్డి ప్రచారం





కోవూరు నియోజకవర్గంలో ఉప ఎన్నిక పుణ్యమా అని రాజకీయ సందడి నెలకొనింది. నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి శాసనసభ్యత్వం రద్దు కావడంతో వచ్చిన ఉప ఎన్నికల బరిలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నుంచి ప్రసన్న అభ్యర్థిత్వం, తెలుగుదేశం పార్టీ తరపున సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి అభ్యర్థిత్వం ఖరారయ్యింది. కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి ఎవరనే విషయమై స్పష్టత రాలేదు. ఏడాది కాలంగా నియోజకవర్గ కాంగ్రెస్ పార్టీ ఇన్‌చార్జిగా వ్యవహరిస్తున్న నారాయణ హాస్పటల్ సిఇఓ పట్టాభిరామిరెడ్డి టిక్కెట్ ఆశిస్తుండగా, మాజీ ఎమ్మెల్యే పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డి సైతం టిక్కెట్ రేసులో వుంటూ ఎవరికి వారు ముమ్మర ప్రయత్నాల్లో వున్నారు. కోవూరులో మొదటి నుంచి కాంగ్రెస్‌పార్టీ బలహీనంగా వుండడంతో మంత్రి, ఆయన అనుచరులు నియోజకవర్గంపై ప్రత్యేక దృష్టి సారిస్తున్నారు. నియోజకవర్గానికి గుండెకాయలాంటి బుచ్చిరెడ్డిపాళెంలో మంత్రి ఆనం పలు పర్యాయాలు పర్యటించి వున్నారు. ఈ పరిస్థితుల్లో వైఎస్ఆర్ పార్టీ నుంచి విష్ణు అనుచరగణం వలసలు ప్రారంభం అయ్యాయి. అన్ని పార్టీల నేతలు కొత్తగా నియోజకవర్గంలో కలసిన ఇందుకూరుపేట మండలంపై ప్రత్యేక దృష్టి సారిస్తున్నారు. ముఖ్యంగా సోమిరెడ్డి, ప్రసన్నలు పోటీపోటీగా పలువురిని కలుస్తున్నారు. ఒకరిపై ఒకరు గెలుపు సాధించాలని ముమ్మర ప్రయత్నాల్లో వున్నారు. చోటా నేతలకు మాత్రం దండిగా పని దొరికింది. సమావేశాలు, కార్యకర్తలను కలుసుకోవడం ఇతరత్రా కార్యక్రమాల పేరుతో సందడి చేస్తుండడంతో ఎన్నికల వేడి రాజుకుంటోంది కోవూరులో.

# ముత్తుకూరులో అతిసార!

● పారిశుధ్యం క్షీణింపే కారణం.

ముత్తుకూరు మండలంలో అతిసార ప్రబలుతోంది. పలు ప్రాంతాల్లో పారిశుధ్యం క్షీణించడం, మురుగు నీరు, చెత్తకుప్పలు, త్రాగునీరు కలుషితం అవుతుండడంతో ప్రజలు రోగాలబారిన పడి ఆస్పత్రి పాలవుతున్నారు. అతిసార బారినపడే వారి సంఖ్య రోజురోజుకు అధికమవుతోంది. మండలంలోని బ్రహ్మదేవం పంచాయితి ఈదూరువారిపాళెం గిరిజన కాలనీ అతిసారతో అతలాకుతలం అవుతోంది. గత వారంరోజులుగా కాలనీలో ఈ వ్యాధి బారినపడి పలువురు మంచం పట్టారు. చికిత్స చేయించుకొనే స్థోమత లేక, అతిసార వ్యాధి గురించి అవగాహన లేకపోవడంతో గిరిజన కుటుంబాలలో చిన్న పెద్ద అనే తేడా లేకుండా కుటుంబాలకు కుటుంబాలు రోగగ్రస్తులయ్యారు. పరిస్థితి విషమించడంతో స్థానికులు 108కు సమాచారం అందించడంతో వైద్య సిబ్బంది వచ్చి పలువురిని ఆస్పత్రిల్లో చేర్పించి చికిత్స అందిస్తున్నారు. పారిశుధ్యం మెరుగు పరచేందుకు ఎవ్వరూ చర్యలు చేపట్టకపోవడమే అతిసార ప్రబలడానికి కారణమని పలువురు ఆరోపిస్తున్నారు. ఇప్పటికైనా అధికారులు నిద్రమేల్కొని మండలంలో పారిశుధ్యాన్ని మెరుగుపరచి ప్రజల ఆరోగ్యాన్ని కాపాడాల్సిన అవసరం వుంది.

● గూడూరు

# బస్టాండ్‌కు రాని బస్సులు

## అర్ధరాత్రి ప్రయాణీకుల అవస్థలు

పలు ప్రాంతాలకు ముఖ్యకూడలి అయిన గూడూరుకు ప్రయాణీకుల రద్దీ అధికంగా వుంటుంది. రైల్వే జంక్షన్ అయినప్పటికీ బస్సుల కోసం వేచి వుండే వారి సంఖ్యా అధికమే. సుదూర ప్రాంతాల నుంచి పలువురు ప్రయాణీకులు ఈ మార్గం గుండా రాకపోకలు సాగిస్తుంటారు. అలాంటి కేంద్రంలో ఆర్టీసి బస్సులు రాత్రివేళ తిరగకపోతుండడంతో ప్రయాణీకులు తీవ్ర ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. రాత్రి తొమ్మిది గంటలు దాటితే గూడూరు బస్టాండుకు వచ్చే బస్సులు చాలా తక్కువ. నెల్లూరు, నాయుడుపేట, తిరుపతి, చెన్నై తదితర ప్రాంతాల నుంచి గూడూరుకు వచ్చే బస్సులు తక్కువ సంఖ్యలో వుండడం, కేవలం గూడూరు డిపో బస్సులే అరకొరగా వస్తుండడంతో ప్రయాణీకులు రాత్రివేళ అష్టకష్టాలు పడాల్సి వస్తోంది. వేళ కాని వేళ బైపాస్‌లో దిగి పట్టణంలోకి రావాలంటే రాత్రి సమయంలో కష్టతరంగా వుండడంతో పలుమార్లు స్థానికులు ఆర్టీసి అధికారులకు వినతి పత్రాలు అందజేసినా పట్టించుకోకపోవడం దారుణం. ప్రయాణీకుల సౌకర్యం కోసమే ఆర్టీసి అని చెప్పే అధికారులు ఈ అసౌకర్యాన్ని పట్టించుకోకపోవడం వుండడం విమర్శకు తావిస్తోంది. ఇప్పటికైనా అధికారులు స్పందించి గూడూరు డిపోకు రాత్రివేళ బస్సులు వచ్చేటట్లు చేయాల్సి వుంది.

## 'బాబు'కు బాబా ఆశీస్సులు!



పీకల్లోతు కష్టాల్లో వున్న చంద్రబాబునాయుడు 'బాబా'ల ఆశీస్సుల కోసం ఉరఉరలాడుతున్నాడు. ఒకప్రక్క సిబిఐ దర్యాప్తులు, మరోప్రక్క పార్టీలో హరికృష్ణ తలనొప్పులతో చంద్రబాబు సతమతమవుతున్నాడు. ఇటీవల ఆదిలాబాద్ జిల్లా పర్యటనకు వెళ్లిన బాబుకు అక్కడి 'పోలాచి బాబా' గురించి ఎవరో చెప్పారట. దీంతో ఆదిలాబాద్ తెలుగుదేశం ఎమ్మీ రాథోడ్ నివాసంలో బాబాను కలిసి తన కష్టాలు చెప్పుకున్నాడట బాబు. పోలాచి బాబా చంద్రబాబును మనసారా ఆశీర్వదించాడట. త్వరలోనే కష్టాలు గట్టెక్కుతాయని ధైర్యం కూడా చెప్పినట్లు భోగట్టా. మొత్తానికి బాబు కూడా బాబాల ఆశ్రయం పొందుతుండటం ప్రస్తుతం పార్టీలో హాట్‌టాపిక్‌గా మారింది.



## కిరణ్ బొత్సాల మధ్య కోల్డ్‌వార్

ముఖ్యమంత్రి కిరణ్‌రెడ్డి, పిసిసి చీఫ్ బొత్సా సత్యనారాయణకు మధ్య కోల్డ్‌వార్ నడుస్తోంది. సిఎం కుర్చీపై బొత్సా కన్నేశాడన్న వార్తలు విన్న దగ్గర నుంచి కిరణ్‌కు కునుకు పట్టడం లేదట. దీంతో బొత్సాను పక్కన బెట్టి రాజకీయం నడిపేస్తున్నాడు కిరణ్.

సిఎం వైఖరి ఎలా వున్నా బొత్సా మాత్రం చాపక్రింద నీరులా తన పని తాను చేసుకుపోతున్నాడు. తరచూ ఢిల్లీకి వెళ్లి పెద్దల మెప్పుపొందుతున్నాడు. అలాగే ఎమ్మెల్యేల్ని వ్యక్తిగతంగా కలుస్తూ సొంత బలాన్ని పెంచుకుంటున్నాడు. ఇలా వుండగా జగన్‌కు మద్దతు పలికిన ఎమ్మెల్యేలపై పార్టీ ఫిరాయింపు వేటు వేయాల్సిందేనంటూ బొత్సా ఒత్తిడి పెంచుతున్నాడు. దీనివల్ల ఉప ఎన్నికలు అనివార్యమవుతాయి. జగన్ గాలిలో కాంగ్రెస్ పార్టీ ఓడిపోవడం ఖాయం కాబట్టి, ఈ ఓటమిని సిఎం వైఫల్యంగా చూపించాలన్నది బొత్సా వ్యూహం. అయితే ఉప ఎన్నికలు జరిగితే ఫలితం తనకు వ్యతిరేకంగా వుంటుంది కాబట్టి జగన్‌వర్గ ఎమ్మెల్యేల్ని బుజ్జగించి ఆకట్టుకోవాలని కిరణ్ నానా తంటాలు పడుతున్నాడు. తన క్లియరెన్స్ లేకుండా వారిపై వేటు వెయ్యొద్దంటూ స్పీకర్‌కు వర్తమానం కూడా పంపారట. మొత్తానికి కిరణ్, బొత్సాల కోల్డ్‌వార్ కాంగ్రెస్‌లో వేడిపుట్టిస్తోంది.

## రమణాచారి బాటలో మరికొందరు ఐఎఎస్‌లు

రెవెన్యూ ముఖ్య కార్యదర్శిగా వున్న సీనియర్ ఐఎఎస్ రమణాచారి స్వచ్ఛంద పదవీ విరమణకు ప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. రమణాచారి పదవీ విరమణకు మరో రెండు నెలలు గడువు వుంది. అయితే గడువుకు ముందే సర్వీసుకు గుడ్‌బై చెప్పాలని రమణాచారి నిర్ణయించుకున్నాడు. ఈ మేరకు చారి పెట్టుకున్న దరఖాస్తును ప్రభుత్వం ఆమోదించింది. రమణాచారి బాటలోనే స్వచ్ఛంద పదవీ విరమణకు మరికొందరు ఐఎఎస్‌లు సిద్ధమవుతున్నట్లు భోగట్టా. సిబిఐ దర్యాప్తులు, ప్రస్తుత ప్రభుత్వ పోకడల పట్ల కొందరు ఐఎఎస్‌లు పెదవి విరుస్తున్నారు. ఈ పరిస్థితుల్లో పని చేయడం కంటే పదవీ విరమణ చేయడమే మంచిదని వారనుకుంటున్నారు. ఇప్పటిదాకా మంచి పోస్టింగ్‌లు దక్కని ఐఎఎస్‌లు కూడా సర్వీసు నుంచి తప్పుకోవాలని యోచిస్తున్నట్లు సచివాలయ వర్గాలు చెవులు కొరుక్కుంటున్నాయి. మొత్తానికి స్వచ్ఛంద పదవీ విరమణ గాలి ఇప్పుడు బాగా వీస్తోందంటూ ఐఎఎస్ వర్గాలు గుసగుసలాడుతున్నట్లు భోగట్టా.

## నాలుక్కరుచుకొంటున్న 'చిరు'



అవిశ్వాస తీర్మానం నుంచి కాంగ్రెస్‌ను గట్టెక్కించిన చిరంజీవి ప్రస్తుతం నాలుక కరుచుకుంటున్నాడు. కాంగ్రెస్‌లో పిఆర్‌పిని విలీనం చేస్తే అటు పార్టీలో ఇటు ప్రభుత్వంలో కూడా పెద్దపీట వేస్తామని కాంగ్రెస్ అధిష్టానం హామీ ఇచ్చింది. దీంతో చిరంజీవి తన ఎమ్మెల్యేలతో సహా కాంగ్రెస్ తీర్థం పుచ్చుకున్నాడు. అయితే కాలం గడుస్తున్నా కూడా అధిష్టానం హామీ ఆచరణలో నెరవేరడం లేదు. ఇటీవల ప్రభుత్వం అవిశ్వాస గండంలో చిక్కుకున్నప్పుడు కూడా చిరు పెద్ద మనసు చేసుకొని కాంగ్రెస్‌ను ఆదుకున్నాడు. అయినా కూడా కాంగ్రెస్ పార్టీ 'చిరు'ను కటాక్షించ లేదు. గతవారం జరిగిన కేంద్రమంత్రి వర్గం మార్పులో 'చిరు'కు కూడా చోటు కల్పిస్తారని అంతా అనుకున్నారు. చిరు వర్గం కూడా గంపెడు ఆశలు పెట్టుకుంది. తీరా చూస్తే 'చిరు'కు కనీసం వర్తమానం కూడా లేదు. దీంతో 'చిరు' విమర్శలకు పదును పెట్టాడు. రాష్ట్రమంత్రి వర్గంలో కనీసం మూడు స్థానాల్ని కేటాయించాలంటూ ప్రకటనలు గుప్పిస్తున్నాడు. అది కూడా సాధ్యమైనంత త్వరగా జరగాలని అల్టిమేటం కూడా ఇచ్చాడు. అయినా కాంగ్రెస్‌పార్టీ 'చిరు'ను పట్టించుకుంటున్నట్లు లేదు. దీంతో చిరు నాలుక కరుచుకుంటున్నాడట. ఇటీవల అవిశ్వాస తీర్మానం సందర్భంగా మెతక వైఖరి వహించడం వల్లనే కాంగ్రెస్ తమను లెక్కచేయడం లేదని పిఆర్‌పి వర్గాలు చిరును నిలదీస్తున్నాయట.






నెల్లూరీయుడు, చెన్నైలోని విజయ హెల్త్ సెంటర్ డైరక్టర్ డాక్టర్ చిల్లకూరు రాజశేఖర్‌రెడ్డికి జీవిత సాఫల్య పురస్కారాన్ని అందజేస్తున్న తమిళనాడు గవర్నర్ కె.రోశయ్య. చిత్రంలో తమిళనాడు ఆరోగ్య శాఖ మంత్రి డాక్టర్ విజయ్, ఎమ్జీఆర్ మెడికల్ యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ డాక్టర్ నటరాజన్ వున్నారు.



నిడిగుంటపాళెంలో డాక్టర్ ప్రేమసాగర్‌రెడ్డి సౌజన్యంతో నార్త్ అమెరికా తెలుగు అసోసియేషన్ నేతృత్వంలో జరిగిన మెగా ఉచిత వైద్య శిబిరాన్ని ప్రారంభిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన శ్రీహరిరెడ్డి, ఎఎస్పీ నాగేశ్వరరావు, ఆర్డీఓ మాధవీలత వున్నారు.



నెల్లూరు వైఎంసిఎ గ్రౌండ్‌లో హ్యాండ్ లూమ్ హ్యాండీక్రాఫ్ట్స్ ఎగ్జిబిషన్‌ను పురస్కరించుకొని ఏర్పాటుచేసిన తాజ్‌మహల్ నకలు కట్టడం.

# హనుమద్వ్రతంతో సుఖ శాంతులు!



మాసాల్లోకెల్లా మార్గశిర మాసానికి ఎంతో విశిష్టత వుంది. శ్రీహరికి ప్రీతికరమైన ఈ మాసంలో చేసే వ్రతాలకు ఎంతో ప్రాధాన్యత వుంది. అలాంటి వ్రతాల్లో ఆంజనేయ స్వామిని అర్చిస్తూ చేసే హనుమద్వ్రతానికి అధిక ప్రాశస్త్యం వుంది. రామభక్తుడు, భక్తాగ్రేసరుడు, చిరంజీవి అయిన అంజనీ పుత్రుని స్తుతిస్తూ మార్గశిర మాసం శుక్లపక్ష త్రయోదశినాడు ఈ వ్రతాన్ని చేస్తారు. దీనిని చేయడం వలన విజయం చేకూరుతుందని, కష్టాలు తొలగి సుఖశాంతులు నెలకొంటాయని, గ్రహపీడల నుంచి విముక్తి లభిస్తుందని పురాణాలు చెప్తున్నాయి. హనుమద్వ్రతాన్ని తొలిసారిగా శ్రీరాముడే ఆచరించాడని, ఆతర్వాత ద్వాపర యుగంలో పాండవులు చేసినట్లు పురాణ కథనం.

శ్రీరాముడు తండ్రి మాట మేరకు సీతాలక్ష్మణ సమేతుడై వనవాసం చేసే సమయంలో రావణుడు సీతను అపహరించుకొని వెళ్తాడు. సీతను వెదుకుతూ రామలక్ష్మణులు ఋష్యముఖ పర్వతం వద్దకు వచ్చిన సమయంలో వారిని హనుమంతుడు కలుస్తాడు. అప్పుడు శ్రీరాముడు ఆయన పుట్టు పూర్వోత్తరాలు అడిగిన సందర్భంలో హనుమ తన జన్మవృత్తాంతాన్ని వివరించి ఇంద్రుడి వజ్రాయుధం మూలంగా హనుమ (చెక్కిళ్లు) దెబ్బతినడం, వాయుస్తంభనం, సూర్యుడి వద్ద విద్యనభ్యసించడం, బ్రహ్మాధిదేవతలందరూ శక్తిని ప్రసాదించడాన్ని వివరిస్తాడు. అప్పుడు శ్రీరాముడు చిరంజీవిగా దేవతల నుంచి వరం పొందిన హనుమంతుడిని అర్చిస్తే సమస్త దేవతలను పూజించినట్లేనని భావించి హనుమద్వ్రతాన్ని చేస్తాడు. దీని ఫలితంగా రావణుని వధించి సీతను తిరిగి పొందగలిగాడని పురాణాలు చెప్తున్నాయి. ద్వాపరయుగంలో అరణ్యవాసం చేస్తున్న పాండవులు తమ కష్టాలను తొలగించి తిరిగి రాజ్యాధికారం కల్పించమని తమను చూసేందుకు వచ్చిన వ్యాసమహర్షిని వేడుకొంటారు. ఆ సమయంలో వ్యాసుడు వారిని హనుమద్వ్రతం చేయమని సూచిస్తాడు. మహర్షి ఉపదేశానుసారం పాండవులు ఆ వ్రతం ఆచరించి విజయులై రాజ్యాధికారం పొందినట్లు చెప్తారు. అంతటి శక్తి ఈ వ్రతానికి వుండడం వలన దీనిని చేపట్టినట్లయితే కష్టాలు, గ్రహబాధలు తొలగి మానసిక, శారీరక శక్తి లభిస్తుందని, సుఖశాంతులు లభిస్తాయని పురాణాలు చెప్తున్నాయి. ఈ వ్రతాన్ని చేసేవారు పూజా మందిరంలో పీఠంపై కలశాన్ని ఏర్పాటు చేసి దాని వెనుక ఆంజనేయుని ప్రతిమను గాని, విగ్రహాన్నిగాని పెట్టాలి. ముందుగా విఘ్నేశ్వర పూజ చేసి అనంతరం హనుమంతుని పూజించి ఆరోజు ఉపవాసం వుండినట్లయితే శుభం జరుగుతుంది. J




షుగర్ వ్యాధిగ్రస్తులకు సంజీవని జెరిటిన్-డి

## ట్రంకు రోడ్డు



### పాపం విలేకర్లు!




ఏసిబి అధికారులు రాష్ట్ర వ్యాప్తంగా మద్యం సిండికేట్లపై జరిపిన దాడుల్లో నెలనెలా వీరి వద్ద మామూళ్లు తీసుకొనే నేతలు, అధికారుల పేర్లతో పాటు పత్రికా విలేకర్లు, ఎలక్ట్రానిక్ మీడియా ప్రతినిధుల పేర్లు బయటపడ్డాయి. నెల్లూరులో అయితే నేతలు, ఎక్సైజ్, పోలీసు, రెవిన్యూ అధికారులకు లక్షల్లో నెల మామూళ్లు ఇస్తున్నట్లు క్యాష్ బుక్‌లో పేర్లు కూడా బయటపడ్డాయి. సంవత్సరానికి వీరికిస్తున్న మామూళ్లు లెక్కవేస్తే లక్షల రూపాయలకు చేరుకొన్నాయి. దినపత్రికల్లో అగ్రశ్రేణి రెండు పత్రికలకు నెలకు 10వేలు, మిగతా వాటికి 500 రూపాయలు లెక్కన ఇస్తున్నట్లు వ్రాసి వుంది. 500 రూపాయలు మామూళ్లతో పత్రికలు 'వార్తల్లో' వెలిగిపోవడంపై ట్రంకురోడ్డులో ఒకటే చర్చ జరుగుతోంది.

### ప్రసన్నకు ఆదాల జీతం



కోవూరు ఉపఎన్నికల నేపథ్యంలో రాజకీయ విమర్శలు తారాస్థాయికి చేరుకొంటున్నాయి. ఇక్కడ తెలుగుదేశం తరపున ప్రచారం ప్రారంభించిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డిని ఉద్దేశించి గొప్ప వ్యక్తి కడుపున పుట్టి నెలనెలా జీతం మాత్రం ఆదాల ప్రభాకర్‌రెడ్డి వద్ద తీసుకోవడం వింటుంటే కడుపు తరుక్కు పోతుందన్నారు. రాష్ట్ర రాజకీయాల్లో చిరంజీవి శిఖండని, దేశం మొత్తం మీద వైఎస్ జగన్‌లా వివిధ నగరాల్లో రాజభవనాలున్న మరో రాజకీయ నేత ఎవరూలేరని దెప్పిపొడవడం చర్చనీయాంశమయ్యింది.

### మెజీషియన్లు చాలరు!



నెల్లూరులో ప్రముఖ మెజీషియన్ రాంజీ 18తేది కస్తూరిబా కళాక్షేత్రంలో నృత్యేంద్రజాల ప్రదర్శన ఇచ్చారు. ఈ ప్రదర్శనకు ముందు జరిగిన సభకు జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి ముఖ్యఅతిథులుగా పాల్గొన్నారు. వక్తగా పాల్గొన్న బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి సభికులు, అతిథులు బిత్తరపోయేలా మాట్లాడిన మాటలు ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యాయి. రాంజీ గొప్ప మెజీషియన్ కావచ్చు. కాని నెల్లూరు నేతలు చేసే మ్యాజిక్కుల ముందు ఆయన దిగదుడుపేననడంతో ఈ వ్యాఖ్యకు శ్రీధర్‌కృష్ణారెడ్డి నవ్వలేక నవ్వగా, వివేకానందరెడ్డి తనకు ఏమి వినబడనట్లు మైకు చేత బట్టుకొని తిప్పుకోవడం చూసే వారికి నవ్వు తెప్పించింది.

### టాక్ ఆఫ్ ది టౌన్



దొంగలు పెద్ద సాహసమే చేశారు. చీమలు దూరను సంశయించే నెల్లూరు కాపువీధిలో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఇంటికి దొంగతనానికి వెళ్లారు. షో కేసుల్లో బొమ్మలు మినహా అక్కడ చిల్లి చిం డబ్బు కూడా వారికి దొరకలేదు. కాని నోరున్న ఈ ఎమ్మెల్యే ఇంట్లో జరిగిన దొంగతనాన్ని పోలీసులు బయటపెట్టలేదు. ఈవారంలో తన ప్రక్కింట్లో వుండే ముఖ్య అనుచరుని ఇంట్లో పెద్ద దొంగతనం జరగ్గా అక్కడకు వెళ్లిన వివేకానందరెడ్డి తన ఇంట్లో దొంగతనం జరిగిన విషయం బహిరంగపర్చారు. నగరంలో రోజుకో దొంగతనం జరుగుతుంటే ఏం చేస్తున్నారంటూ పోలీసు అధికారులను ఉతికి ఆరేశారు. వివేకా తిట్లకు దడచిన పోలీసులు వెనువెంటనే క్రైం మీటింగు, రాత్రిపూట గస్తీ అంటూ దడబడలు చేయడం టాక్ ఆఫ్ ది టౌన్ అయ్యింది.

# వారఫలాలు

*తేది 24-12-2011 నుండి 30-12-2011 వరకు ధనుస్సులో రవి; మకరంలో శుక్రుడు; మేషంలో గురువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో బుధ, రాహువులు; వృషభంలో కేతువు; సింహ, కన్య, తుల, వృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

వ్యాపార విషయాల కారణంగా దూర ప్రయాణాలపై ఆసక్తి కనబరుస్తారు. నూతన ఆదాయమార్గాలు అన్వేషిస్తారు. సాధారణంగా గడచిపోతుంది. కళత్రంతో గొడవలు వుంటాయి. ఆర్థికవిషయాలు చక్కగా ఉన్నాయి. గృహిణులకు శ్వేతప్రదరం బాధించవచ్చు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

నమ్మిన వారి నుంచి మీరు ఆశించిన జవాబు రాదు. స్త్రీలు తమ ఆరోగ్యం పట్ల జాగ్రత్త వహించాలి. సోదరుల మూలంగా ఖర్చు. వ్యాపారులకు మొదట అంతంత మాత్రంగానే వున్నా తర్వాత లాభాలు వస్తాయి. వారం మొదట్లో ధనలాభం, కొత్తవారితో పరిచయాలు.సహనం, సంయమనం అవసరం. కుటుంబ సభ్యులతో చిన్నపాటి మాట పట్టింపులు, అభిప్రాయభేదాలు కలుగుతాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

స్త్రీ సుఖం, కీర్తి, సమాజంలో పేరు బాగుంటుంది. సకాలంలో తగు నిర్ణయాలు తీసుకొంటారు. నూతన విద్యా వైజ్ఞానిక ప్రయోగాలు, వ్యాపారాలు విజయవంతమవుతాయి. తరచూ అనారోగ్యానికి గురౌతారు. అనుకొన్న పనులన్నీ అనుకొన్న రీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకొంటూపోతారు. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి వుంటుంది. ఇంత వరకు వుంటూవచ్చిన ఇబ్బందులు తొలగుతాయి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

కళత్ర సౌఖ్యం, మానసికానందం కలుగుతాయి. సోదరవర్గ బలం మీకు బాగా కలిసివస్తుంది. పరోపకారతత్వంతో మెలుగుతారు. కుటుంబంలోని సమస్యలను పరిష్కరించుకొంటారు. తరచూ అనారోగ్యానికి, అసౌఖ్యానికి గురౌతుంటారు. మెలుకువగా వ్యవహరించండి. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. ప్రయాణాలు అనుకూలిస్తాయి. రాజకీయ నాయకులు జాగ్రత్త వహించండి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనీ సమస్యాత్మకంగా వుంటుంది. ఫలితంగా కంగారు పడుతుంటారు. కుటుంబములో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేతమవుతాయి. దైవానుగ్రహం, పెద్దల ఆశీర్వాదం వల్ల చివరికి ఫలితం మీకనుకూలంగా వుంటుంది. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదముంది.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్త 1, 2 పా

కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. ఉద్యోగులకు విధుల పట్ల అనాసక్తత. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొని మీ పనులు చక్క దిద్దుకొంటారు. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు.

## పంచాంగం

25తేది క్రిస్టమస్.

**శుభ ముహూర్తాలు లేవు.**

**డిసెంబర్ తిథులు**

**మార్గశిర బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 24 | శని | అమావాస్య | రా 11.40 | గం.ల.వ |

**పుష్య శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 25 | ఆది | పాడ్యమి | రా 10.22 | గం.ల.వ |
| 26 | సోమ | విదియ | రా 09.21 | గం.ల.వ |
| 27 | మంగళ | తదియ | రా 08.50 | గం.ల.వ |
| 28 | బుధ | చవితి | రా 08.04 | గం.ల.వ |
| 29 | గురు | పంచమి | రా 09.10 | గం.ల.వ |
| 30 | శుక్ర | షష్ఠి | రా 10.08 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com



**తుల**
చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

బంధుమిత్రులకు సంబంధించిన శుభకార్యాల్లో పాల్గొంటారు. నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనిని ప్రతిష్ఠాత్మకంగా పూర్తిచేస్తారు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేతమౌతాయి. సంతానం విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

ఋణ భయం. ఇతరుల వలన మోసపోతారు. సరైన సమయానికి తగిన ప్రణాళికలు వేయలేక సతమతమవుతారు. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

తొందరపాటు నిర్ణయాల వల్ల ఇబ్బందులు తప్పవు. గృహనిర్మాణ కార్యక్రమాలు చేపడతారు. ఆత్మస్థైర్యాన్ని పెంపొందించుకోండి. మిత్రులు సాయమందిస్తారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకను కూలంగా వుంటాయి. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. భూభవనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఉదర బాధ, అనుకూలం లేని ఆహారం తప్పవు. స్త్రీ సౌఖ్యం, అనుకూల ప్రయాణాలు, బంధు మిత్రుల కలయికతో ఉల్లాసంగా వుంటారు. క్రయవిక్రయాలు మీకనుకూలంగా జరుగుతాయి. విద్యార్థులకు మంచి కాలం. గతంలో చేసిన తప్పిదాలను, విశ్లేషించుకొనే పనిలో పడుతారు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు. నూతన పెట్టుబడులు లాభిస్తాయి.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

పరిస్థితుల ప్రతికూలత. కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతిఫలం తప్పక పొందుతారు. ఉద్యోగులకు విధుల పట్ల అనాసక్తత. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఇంటికి సంబంధించిన విషయాలను ఇతరులతో పంచుకోకపోవడమే మంచిది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతిఫలం తప్పక పొందుతారు. నిస్పృహ, మనోవ్యాకులత. విరోధుల విషయంలో జాగ్రత్త. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు.

# జ్యోతిష శాస్త్రవేత్తలు బాలికల ఉసురు పోసుకోకండి!

*ఇరివెంటి ఇందిర — హైదరాబాద్*

* *నిక్షేపంగా కుదిరిన సంబంధాన్ని తనను సంప్రదించలేదన్న నెపంతో ఓ పూజారి నాశనం చేశాడు.*

ఇది సంస్కారహీనమైన, నికృష్టమైన చర్య. గ్రహబలం బాగుంటే దోషాల్ని పాటించనక్కరలేదని జ్యోతిష గ్రంథం 'పూర్వ కాలామృతం' చెబుతోంది. దయచేసి మిడి మిడి జ్ఞానంతో 'బాలికల' ఉసురు పోసుకోవద్దని వారికి నా విజ్ఞప్తి.

*టి.వి.ఎన్.లక్ష్మి — బాపట్ల*

* *అమ్మాయికి వివాహం ఆలస్యం అవుతోంది. తగిన పరిష్కారాన్ని చెప్పండి?*

దేవుడి గదిలో పైభాగంలో 'నరఘోష' యంత్రం ప్రతిష్ఠించుకోండి. అమ్మాయికి పుష్యరాగం (శ్రేష్ఠ) కుడి చిటికెన వ్రేలు(బుధస్థానం)కు ధరింపజేయండి.

*వి.అరుణజ్యోత్స్న — ఆత్మకూరు*

* *నాది ఆర్ద్ర, వారిది శ్రవణా నక్షత్రం. మేం ఏ దేవతలను పూజించాలి?*

ఆర్ద్ర వారు శివుణ్ని, శ్రవణావారు విష్ణువును పూజించాలి.

*ఎన్.మేరీజాన్సన్ — సికింద్రాబాద్*

* *'సోమవారం' శుభ కార్యక్రమాలకు, ముఖ్యంగా వివాహానికి నిషిద్ధమా?*

జ్యోతిష శాస్త్రాలు దాదాపు ముప్పై రెండు 'సోమవారం' వివాహాన్ని సమర్థిస్తున్నాయి. ఒకటి, రెండు గ్రంథాలలోని 'అక్షర దోషాల' వల్ల ఈవిధమైన దుష్ప్రభావం, ప్రచారం జరిగింది.

*పండింటి సురేఖ — తిరుపతి*

* *తూర్పు ఇల్లు. దక్షిణ వీధి. ఏ విధంగానూ కలసి రావడం లేదు.*

దక్షిణ రాజవీధి అయినపుడు దక్షిణం వైపే ఇల్లు నిర్మించుకోవాలి. ఇతర దిక్కుల్లో నిర్మించడం వల్ల ఆయా స్థానాలు భ్రష్టమై సమస్యలు ఎదురవుతాయి.

*బైరాగి కోదండరెడ్డి — కడప*

* *యంత్ర ప్రతిష్ఠ చేశాక చాలా ఆశ్చర్యం. రావనుకొన్న అప్పులు వచ్చాయి?*

మంత్ర బీజాక్షర యుక్తమైన 'యంత్రం' శాస్త్రీయంగా తయారుచేసినదైతే మహత్యాలు చాలా ఉంటాయి. అందులో మీకు జరిగిన సంఘటన ఒకటి.

*షేక్ మునాఫ్ — కరీంనగర్*

* *రజస్వల, జన్మతిథి దోషాల్ని ఇంట్లో వారికి అంటగట్టడం ఎంత వరకు న్యాయం?*

ఏ శాస్త్రంలోనైనా మంచి, చెడులు రెండూ ఉంటాయి. మనం మంచినే గ్రహించాలి. ఛాందసాలను ఆధునిక కాలంలో కాలమే పారద్రోలుతుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*సి.జానకిరామయ్య — కాకినాడ*

* *కోడలు నిర్వాకం వల్ల నేను ప్రస్తుతం ఓల్డేజిహోమ్‌లో ఉంటున్నాను.*

గ్రహరాశులు మీకు అనుకూలం కాని సమయం అయినప్పటికీ, మీ వేధింపులు ఆమెను అలా తయారు చేశాయి. మన ఇంటికి వచ్చిన వాళ్లని మన వాళ్లుగా చూడాలి. పరాయి వాళ్లుగా చూస్తే పరిస్థితి ఎవరికైనా ఇంతే.

*షేక్ ఉస్మాన్‌షరీఫ్ — కర్నూలు*

* *మిద్దెపైన పావురాలు పెంచడం దోషమా?*

చెట్లు, పక్షులు పెంచే వారింట దేవతలు నివసిస్తారని 'వశిష్ఠ సంహిత' చెబుతున్నది. దోషాలను గురించిన ప్రచారాలు మానవమాత్రులవే!

*జంపాల స్వర్ణలత — విజయవాడ*

* *శ్రీవారు చనిపోయారు. అమ్మాయి మతి కోల్పోయింది. నేను మాత్రం ఎందుకు బ్రతకాలి?*

మీ ఇంట్లో దక్షిణ, తూర్పు దోషాలున్నాయి. వాటిని సరిచేసుకోండి. మీరు మీ అమ్మాయి కోసం బ్రతకాలి. దైవపూజ, ధ్యాననిష్ఠ జీవన గమనాన్ని మార్పివేస్తాయని 'అగ్ని పురాణం' చెబుతోంది.

*ఎన్.సుప్రియ — విశాఖ*

* *హింసాత్మకమైన అతన్ని వదిలితే పిల్లలు అన్యాయమైపోతారని భరిస్తున్నాను.*

జాతకం, గృహం ప్లాను అన్నీ పరిశీలించాను. అందులోని లోపాలకంటే మీరు చెప్పిన విషయాలను బట్టి అతను 'సైకో' అని అర్థమయింది. అతను ప్రభుత్వ ఉద్యోగికాబట్టి న్యాయ సలహా తీసుకొని, మీ కాళ్ల మీద నిలబడటానికి ప్రయత్నించండి.

# అధికార మదాంధులతో విరోధం 'జమీన్‌రైతు' పాటించే సాంప్రదాయం!

- గద్దె ఎక్కేవరకు మిత్రులు, ఆ వెంటనే శత్రువులు.
- ఎసి నుంచి వివేకా వరకు అందరిదీ ఒకే దారి.
- కేసులు, దాడులు, దౌర్జన్యాలు తీరు మార్చలేవు.
- సామాజిక బాధ్యత పరమ పవిత్రమైనది.
- వారసత్వంగా వచ్చిందే ఈ ధీరత్వం.



జమీన్‌రైతు స్థాపకుడు నెల్లూరు వెంకట్రామా నాయుడు.



జమీన్‌రైతు జీవప్రదాత నెల్లూరు శ్రీరామమూర్తి.

'జమీన్‌రైతు' సంపాదకుడిగా, నెల్లూరు మేజిస్ట్రేట్ కోర్టు విధించిన ఆరునెలల కారాగార వాస శిక్షపై అటు మా పాఠకులలో, ఇటు సాధారణ ప్రజలలో కూడా తీవ్రస్థాయి చర్చ జరుగుతున్నది. మాజీ మేయర్ నందిమండలం భానుశ్రీ దాఖలు చేసిన పరువు నష్టం కేసులో భాగంగా ఈ శిక్ష విధింపు జరిగింది. ఈ చర్చలో తలెత్తుతున్న పలు అంశాలపై వివరణ ఇవ్వడం మా బాధ్యతగా భావిస్తున్నాము.

### పుట్టుకే పోరాటం!

తెలుగు పత్రికా రంగంలో 'జమీన్‌రైతు' పత్రికకు ఒక విశిష్ట స్థానం వుందన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. జమీందారీ విధానం రద్దు ఉద్యమంలో భాగంగా జన్మించిన ఈ పత్రిక, ఆ ఉద్యమ లక్ష్యం నెరవేరిన తర్వాత కూడా ప్రచురణ కొనసాగించి, నెల్లూరు జిల్లా ప్రజల జీవనంలో ఒక భాగంగా మారిపోయింది. పోరాటం కోసమే పుట్టిన పత్రిక అది. 82ఏళ్ల సుదీర్ఘము, ఉత్కృష్టము అయిన చరిత్ర దానిది. ఇంతకాలం పాటు, ఒక్క వారం కూడా అంతరాయం లేకుండా నడిచిన పత్రిక తెలుగు పత్రికా రంగంలో మరొకటి లేదు. నిర్దిష్టమైన పాత్రికేయ ప్రమాణాలు, విలువలు, సత్సాంప్రదాయాలు పాటిస్తున్నందువల్లనే 'జమీన్‌రైతు' పత్రికకు ఈ ఘనత సాధ్యమయ్యింది. జర్నలిజం విద్యార్థులకు ఒక పాఠ్యాంశంగా ప్రసిద్ధి పొందుతున్నది. నీతి, నిర్భీతి, నిష్పక్షపాతం, అధికార మద గజాలను ఢీకొనే సాహసం, యముడికి శివుడికి కూడా వెరవని ధీరత్వం, స్వచ్ఛమైన విమర్శ, నిఖార్సైన రాజకీయ సమీక్షలు 'జమీన్‌రైతు'కు నిర్విఘ్న పాఠకాదరణ సంతరించి పెడుతున్నాయి.

### కత్తి మీద సాము!

సాధారణ పత్రికలు నడపడం వేరు, స్థానిక పత్రికలు నడపడం వేరు. స్థానిక పత్రికలలో వార్తలు వ్రాయడం, విమర్శలు చేయడం కత్తి మీద సాముతో సమానం. మంచిగా వ్రాసినప్పుడు మా గొప్ప అని గర్వపడి, వదిలివేస్తారు. తప్పులు ఎత్తి చూపించినప్పుడు మాత్రం శత్రుత్వం పెంచుకొంటారు. ఎదురు పడినప్పుడల్లా ఎత్తి పొడుస్తారు. ఒక జీవితకాలం పాటు ఆ సంకట పరిస్థితి ఎదుర్కోవాలి.

### మొగమాటాలుండవు

నిజం చెప్పాలంటే 'జమీన్‌రైతు'కు జిల్లాకు సంబంధించిన ఎవరితోనూ వ్యక్తిగత ద్వేషాలు వుండవు. వుండే అవకాశం కూడా లేదు. ఎవరితోనూ ఎటువంటి లావాదేవీలు జరపకపోవడం వల్లనే, ఎవరితోనూ మొగమాటాలు పెంచుకోకుండా నిగ్రహం వహించడం వల్లనే అది సాధ్యమౌతున్నది. ఒక ప్రకటన ఇవ్వమని కానీ, చందా కట్టమని కానీ 'జమీన్‌రైతు' తరపున ఎవరూ ఎవరి మీదా ఒత్తిడి తెచ్చిన సాదృశ్యం లేదు. ప్రకటనల కోసం వార్తలు వ్రాసే అలవాటు లేదు. ఆ నియమం వల్ల పత్రిక నిర్వహణ కష్టసాధ్యంగా మారినా, జీతాలిచ్చే పరిస్థితి కూడా లేకపోయినా పంటి బిగువున భరించడం తప్ప పరిస్థితులతో రాజీ పడకపోవడమే 'జమీన్‌రైతు' ఇంతకాలం ఇంత సజీవంగా నడవడానికి కారణం. స్థానిక పత్రిక నిర్వహణలో ఈ నియమాలు ఆచరించే ఆత్మస్థైర్యం ఒక్క 'జమీన్‌రైతు'కు తప్ప రాష్ట్రంలో మరే పత్రికకూ లేదని గర్వంగా చెప్పగలము.

ఆయా సందర్భాలలో, సమయాలలో మా దృష్టికి వచ్చిన వార్తలను వున్నది వున్నట్లుగా వ్రాయడం, మా అభిప్రాయాలు కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పడం తప్ప ఎవరి మీదా ద్వేషంతో, పక్షపాతంతో వ్యవహరించడం జరగలేదు, ఇక ముందు కూడా జరగదు.

### అధికారంలో వుండే వారితో పేచీ!

జిల్లా రాజకీయాలలో ఎవరు అధికారంలో వుంటే వారితో పేచీ తలెత్తడం అలవాటై పోయింది. స్వాతంత్ర్యానికి పూర్వం వెంకటగిరి జమీందారులతో ప్రత్యక్ష యుద్ధమే నడిచింది. లెక్కలేనన్ని కేసులు, నిర్బంధాలు, నిషేధాలు, జరిమానాలు ఎదురైనాయి. వెంకటగిరి జమీందారులు ఈ జిల్లాలో ఒక్క ఎన్నికలో కూడా గెలవలేక పోవడానికి 'జమీన్‌రైతు' పత్రిక జరిపిన ఉద్యమమే కారణమని సగర్వంగా చెప్పుకోవచ్చు.

### ఎసి దౌర్జన్యాలు

స్వాతంత్ర్యం తర్వాత ఎసి సుబ్బారెడ్డి జిల్లా రాజకీయ పెత్తనం చేశాడు. ఆయనతో చివరి వరకు 'జమీన్‌రైతు' రాజీ పడలేదు. ఒక సందర్భంలో పత్రిక స్థాపకుడు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామా నాయుడు గారి మీద దౌర్జన్యానికి కూడా దిగాడు ఎసి. తర్వాత వచ్చిన ఆనం సంజీవరెడ్డి నూకల స్వాహా కేసు వెలుగులోకి తెచ్చింది జమీన్‌రైతే. దాని ప్రభావంతో ఆయనతో ఎంతోకాలం వైరం నడిచింది.

### జై ఆంధ్రాలో దాడులు

ఆ వెంటనే జై ఆంధ్రా ఉద్యమం. 'జమీన్‌రైతు' విశాలాంధ్ర కోరుకొన్నది. దానికి పరిహారంగా ఆఫీసు మీద దాడులు, పత్రిక దహనాలు, ఆర్థిక నష్టాలు, వీధులలో దౌర్జన్యాలు. ఆనాటి గవర్నర్ సలహాదారు హెచ్‌కె.సరీన్, 'జమీన్‌రైతు' రక్షణకు ఒక ప్రత్యేక పోలీసు బృందాన్ని నియమించాడంటే, పరిస్థితి ఎంత భీకరంగా వుండిందో అర్థం చేసుకోవచ్చు. అయినా 'జమీన్‌రైతు' నిర్వాహకుడు నెల్లూరు శ్రీరామమూర్తి, ఆ కష్టాలను భరించాడే తప్ప ఆందోళనకారులు కోరినట్లుగా జైఆంధ్రా అన్న నినాదాన్ని తన నోట పలకలేదు. ఆ వెంటనే నక్సలైట్ల హింస. దాన్ని వ్యతిరేకించినందుకు ఆనాటి సంపాదకుడి ఇంటి మీద దాడికి పూనుకొన్నారు నక్సలైట్లు. తర్వాత కాలంలో సిబిఐ డైరెక్టర్‌గా జాతీయ ప్రతిష్ట సంపాదించిన కె.విజయరామారావు నెల్లూరు ఎస్పీగా వుంటూ, శ్రీరామమూర్తి గారి ఇంటి ముందు ఎన్నో రాత్రులు కాపలా కాశాడు. ప్రాణభయంలోనూ నక్సలైట్ల హింసాయుత విధానాలను సమర్థించలేదు 'జమీన్‌రైతు'. తొలినాటి సంపాదకులిద్దరూ పాటించిన ఆ చిత్తశుద్ధి, సామాజిక నిబద్ధత, సాహసోపేత వైఖరుల నుంచి, సమస్యలనెదిరించే ధీరత్వం ఇప్పటి తరానికి వారసత్వంగా సంక్రమించింది. దాని మూలాలు, వారి సంకల్పబలంలో వ్రేళ్లూనుకొని వున్నాయి. వాటిని కదిలించడం ఎవరి తరమూ కాదు.

### నల్లపరెడ్డి ఒక్కడే!

తర్వాత తరంలో అధికారంలోకి వచ్చిన నాయకులు నేదురుమల్లి జనార్దనరెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి వంటి వారందరితోనూ 'జమీన్‌రైతు'కు పేచీ, జనార్దనరెడ్డి గారు రెవిన్యూ మంత్రిగా వున్నప్పుడు 'జమీన్‌రైతు' మీద జాతీయ భద్రతా చట్టం క్రింద, బెయిలు కూడా దొరకని కేసు మోపబడింది. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి 'జమీన్‌రైతు' మీద శాసనసభలో సభా హక్కుల ఉల్లంఘన నేరం మోపి, అరెస్టు వారెంట్ వరకు తెచ్చాడు. మాజీ స్పీకర్ దివి కొండయ్య చౌదరి, ప్రస్తుత జాతీయ బిజెపి నేత ఎం.వెంకయ్యా నాయుడు కూడా అసెంబ్లీలో ప్రివిలేజ్ మోషన్‌లు తెచ్చారు. ఈ యాభై, అరవై ఏళ్లలో ఎన్నో పరువు నష్టం కేసులు దాఖలైనాయి. కావలిలో జరిగిన ఒక పరువు నష్టం కేసులో ఆనాటికి శాసనసభ స్పీకర్‌గా వుండిన స్వర్గీయ రేబాల దశరథరామిరెడ్డి గారు కోటు తొడుక్కొని, 'జమీన్‌రైతు' తరపున న్యాయవాదిగా వాదనలు వినిపించాడు. ఆ కేసులో 'జమీన్‌రైతు' సంపాదకుడికి ఒక్క రూపాయి జరిమానా విధించబడింది. తన మీద 'జమీన్‌రైతు ఎంత ఉద్ధృతమైన వార్తా దాడి జరిపినా, ఎంత కఠినమైన పదాలతో విమర్శించినా నిజమైన రాజకీయ స్ఫూర్తితో వ్యవహరించిన నాయకుడు నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి గారు ఒక్కరే. తన అసంతృప్తిని, ఆగ్రహాన్ని ఉపన్యాసాల రూపంలో వ్యక్తం చేయడం తప్ప 'జమీన్‌రైతు' మీద కానీ, దాని సంపాదకుల మీద కానీ ఏనాడూ ఒక కేసు వేసే ఆలోచన చేయలేదు.

### అధికారులూ అంతే!

ఎంతో మంది కలెక్టర్లు, ఎస్పీలు, ఇతరత్రా అధికారుల నుంచి కూడా 'జమీన్‌రైతు' పలురకాల నిర్బంధాలు ఎదుర్కొన్నది. నరసయ్య అనే ఒక ఎస్పీ, ఎట్లయినా 'జమీన్‌రైతు' సిబ్బందిని లాకప్‌లోకి నెట్టి, బొక్కలు విరగదీయమని ఒక సబ్‌ఇన్స్‌పెక్టర్‌ను ప్రత్యేకంగా నియమించాడు. కలెక్టర్ హోదాలో హెచ్‌కె.బాబు, 'జమీన్‌రైతు' సంపాదకుడిని అరెస్టు చేయమని పోలీసు మీద ఒత్తిడి తెచ్చాడు. అర్జున్‌రావు గారు అత్యవసర పరిస్థితి కాలంలో 'జమీన్‌రైతు'ను మూయించాలని ప్రయత్నం చేశాడు.

వీటన్నిటికీ కారణం 'జమీన్‌రైతు' వ్రాసిన వార్తలే తప్ప వ్యక్తిగత కారణాలు లేవు. అందువల్లనే కొంతకాలం గడిచిన తర్వాత ఆయా నాయకులు, అధికారులు తమ తొందరపాటు గ్రహించి, పొంపాటు సర్దుకొని, మాతో సత్సంబంధాలు నెరపారు.

కొరవ 15వ పేజీలో



# మళ్లీ రతినిర్వేదం!

అల్లూరు రహీం

రతి నిర్వేదం అనే పేరు చూసి ఇదేదో బూతు చిత్రం అనుకొంటారేమో. అట్లాంటి అసభ్య దృశ్యాలేమీ లేవు. కాని ప్రేక్షకుల మెదడుకు మేత పెట్టి ఆలోచనలను రేకెత్తించగలిగే సన్నివేశాలు మాత్రం ఈ చిత్రంలో చాలానే వున్నాయని చెప్పవచ్చు. 1978 సంవత్సరంలో జయభారతి, కృష్ణచంద్రన్ జంటగా మళయాళంలో విడుదలై సంచలనం సృష్టించిన ఈ సినిమాను మళ్లీ అదే కథతో ఎస్వీకె మీడియా పతాకంపై శోభ నిర్మించారు. ఈ యేడాది మళయాళంలో శ్వేతా మీనన్, సచిత్ విజయ్ జంటగా నటించి విడుదలైన ఈ చిత్రం పాత రతి నిర్వేదం కన్నా రికార్డుస్థాయి కలెక్షన్లు సృష్టించింది. ఈ రోజుల్లోనూ వందరోజులు హౌస్‌ఫుల్ కలెక్షన్‌తో ఆడింది. ఆ చిత్రాన్ని తెలుగులోకి అదే పేరుతో అనువదించారు.




చిత్రంలో హీరోయిన్ పేరు రతి. ఆమె పొందిన నిర్వేదం కాబట్టి ఈ చిత్రానికి ఆ పేరు పెట్టారు. ఇంటర్ చదువు ముగించి ఎంసెట్ పరీక్ష వ్రాసి ఇంజనీరింగ్ కాలేజిలో చేరే వయస్సులో వున్న నూనూగు మీసాల కుర్రవాడికి ప్రక్కింట్లో అతనికన్నా ఆరేళ్ల పెద్దదైన రతికి మధ్య ఆలోచనల విషయమై ఏర్పడిన సంఘర్షణను ఈ చిత్రంలో దర్శకుడు అతి సున్నితంగా ఆవిష్కరించాడు. ఈ సినిమాకు పెద్ద ప్లస్‌పాయింట్ హీరోయిన్ శ్వేతామీనన్. ఆరడగుల ఈ సుందరిని మళయాళ కట్టుబొట్టులతో వెండితెరపై చూస్తూనే మాస్, క్లాస్ ప్రేక్షకులకు రెండు గంటలు గడచిపోతాయి. కేరళలోని పల్లెటూళ్ల అందం, ఓ రెండు పాటలు అయ్యే లోపల ప్రేక్షకులు అప్పుడే చిత్రమయ్యిందా అన్న భావనకు వస్తారు. కెమెరామెన్ మనోజ్ కేరళ గ్రామ సీమల అందాలు, హీరోయిన్ అందాలు హద్దులు దాటని స్థాయిలో కట్టడి చేస్తూ వెండితెరపై చూపిస్తాడు. కాని ఈ చిత్రం ప్రచార చిత్రాలు చూస్తుంటే సెన్సార్‌బోర్డు అధికారులు కళ్లు మూసుకొని అనుమతిచ్చారా అనే అనుమానం రావడం ఖాయం. విజయం సాధించిన పాత చిత్రాలను ఏ మాత్రం మార్చకుండా తీస్తే విజయం సాధిస్తాయని నిరూపించిన చిత్రం రతి నిర్వేదం.

చిత్ర కథలోకి వెళ్తే ఎంసెట్ పరీక్ష వ్రాసిన బుజ్జి (సచిత్ విజయ్)కు పదహారేళ్ల ప్రాయంలో ప్రతి యువకునికి వచ్చే ఆలోచనలతో వుక్కిరి బిక్కిరి అవుతుంటాడు. వీరి ప్రక్కింట్లోనే రతి (శ్వేతా మీనన్) వుంటుంది. ఆమె బుజ్జి కన్నా ఆరేళ్లు పెద్ద. సర్ప దోషం వుందని పెళ్లి ఆలస్యమవుతుంది. ఇద్దరి కుటుంబాల మధ్య అత్యంత సాన్నిహిత్యం వుండడంతో ప్రతిరోజూ ఒకరినొకరు చూసుకొంటుంటారు. కాని బుజ్జిలో ఆమెపై ముందున్న ఆలోచనలు మారుతుంటాయి. కాని రతి ఇవేమీ పట్టించుకోదు. రతి బుజ్జి ఇంటికి వచ్చి యింటి పనుల్లో సాయపడుతుంటే అతను ఆమెను చూస్తూ మైమరచిపోతాడు. ఎన్నెన్నో ఊహించుకొంటాడు. ఆమెను స్పృశించి పరవశించి పోవాలన్న తపనలో అప్పుడప్పుడు హద్దులు దాటే ప్రయత్నం చేసినా రతి అతన్ని వారిస్తుంది. పాపం పసివాడు ఇవన్నీ తెలియక చేస్తున్నాడని సరిపెట్టుకొంటుంది. ఒకరోజు కాస్త చనువుగా వుండే రతి, బుజ్జిలను వాళ్ల అమ్మ చూస్తుంది. ఆలస్యం చేయక పెళ్లి సంబంధం ఖాయం చేస్తుంది. ఇంజనీరింగ్ చదువుకు వెళ్లే ముందురోజు రాత్రి గ్రామంలోని నాగశిలల దగ్గర వీరిద్దరూ కలుస్తారు. ఉరుములు, మెరుపులు, జడివాన మధ్య ఇద్దరు తడచి ముద్దవుతారు. వారిద్దరు ఒకటవ్వడం కాలనాగు కాటేసి ఆమె చనిపోవడం వెనువెంటనే జరిగిపోతాయి.

ఇంత వరకూ కథను చక్కగా నడిపిన దర్శకుడు యుక్త వయస్సులోని యువకుడి, యువతి మానసిక సంఘర్షణ సమస్యను పరిష్కరించే ధోరణి ఆలోచించక మామూలు తరహాలో హీరోయిన్‌ను చంపేయడం పెద్దలోపమే. ఈ చిన్న కథను ఎన్నో భావ సంఘర్షణలతో రసవత్తరమైన సన్నివేశాలతో దర్శకుడు టి.కె.రాజీవ్‌కుమార్ రూపొందించాడని చెప్పక తప్పదు. ఓ తరహా ఫార్ములాతో నడిచే చిత్రాన్ని అన్ని వర్గాల ప్రేక్షకులు మాత్రం చూడలేరు. చిన్న చిత్రంగా విడుదలైన రతి నిర్వేదం భారీ వసూళ్లు చేయడం మాత్రం ఖాయం.

## దివ్యభారతిపై సినిమా



విద్యాబాలన్ నటించిన ద డర్టీపిక్చర్ చిత్రం దర్శకులకు, రచయితలకు కొత్త మార్గం చూపించింది. నటి సిల్క్‌స్మిత జీవితంలోని విషాద పర్వాన్ని డర్టీ పిక్చర్స్‌లో చూపించారు. అయితే వాస్తవిక కోణంలోకంటే మసాలా దినుసులు దట్టించి ఆ చిత్రాన్ని తీర్చిదిద్దారు. అందుకే ప్రేక్షకులు ఆదరించారన్నది నిజం. ఈ విజయం స్ఫూర్తితో దివ్యభారతి జీవితాన్ని కథగా మలిచే పనిలో వున్నారు. తెలుగుచిత్రం బొబ్బిలిరాజాతో తెరంగేట్రం చేసింది ముంబై భామ దివ్యభారతి. ఈ సినిమాలో ఆమె నటించేటప్పటికీ ఆమె వయసు 15 సంవత్సరాలు. నాలుగేళ్ల వ్యవధిలో హిందీ, తెలుగు అగ్రహీరోలందరితో నటించింది. నిర్మాత సాజిద్ నడియాడ్ వాలాను 1993లో పెళ్లి చేసుకొన్న ఆమె ఆ ఏడాది తను నివసించిన అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్‌లో అనుమానాస్పద స్థితిలో మరణించింది. దివ్యభారతిది హత్య అని, ఆత్మహత్య అని పలు కథనాలున్నాయి. ఈ కథ అనుగుణంగా సినిమా కథ నడుస్తుంది. ప్రియదర్శన్ దర్శకత్వంలో ఈ చిత్రం తయారవుతుంది.

## ఫిబ్రవరిలో గోపీచంద్ పెళ్లి!



మొగుడుగా తెరమీద కనిపించిన హీరో గోపీచంద్ 2012లో నిజ జీవితంలోనూ భర్తగా మారబోతున్నాడు. ఫిబ్రవరి 24న ఆయన వివాహానికి ముహూర్తం కుదిరినట్లు తెలిసింది. హైదరాబాద్ యువతి హరితను గోపీ పెళ్లి చేసుకొంటారు. వీరిది పెద్దలు కుదిర్చిన సంబంధం. ఈ నెలలో తాంబులాలు మార్చుకుంటారు. హరిత ఇంజనీరింగ్ పూర్తయ్యాక ఆస్ట్రేలియాలో బిజినెస్ అడ్మినిస్ట్రేషన్‌లో మాస్టర్ డిగ్రీ పొందింది.

## త్రిషలో జంతు ప్రేమ



కథానాయికలు అప్పుడప్పుడూ సంఘసేవలోనూ తలమునకలవుతుంటారు. త్రిష అయితే మూగజీవాలకు పునరావాసం కల్పించే ఓ స్వచ్ఛంద సంస్థలో సభ్యురాలిగా వ్యవహరిస్తోంది. మూగజీవాలను ప్రేమించండి. వాటి ఆలనా పాలనా చూసుకోండి. వాటితో కాసేపు గడిపితే మనసు ప్రశాంతంగా వుంటుందని త్రిష చెబుతుంది. నేను కూడా ఓ కుక్క పిల్లను పెంచుకొంటున్నాను. అదే నా బెస్ట్ ఫ్రెండ్. సమాజసేవ అంటే దేశాన్ని ఉద్ధరించక్కర్లేదు. చుట్టుప్రక్కల వారిని కొంచెం పట్టించుకొంటే చాలంది. పెళ్లికి ఇప్పుడు సిద్ధమే. కాని ఇంకా మనసుకు నచ్చినవాడు కనపడలేదంటుంది.

## అది నాటు పాట!



ఏ నోట విన్నా హీరో ధనుష్ పాడిన కొలవరి డీ... పాట గూర్చే ముచ్చట్లు. ఈ పాటలో గొప్ప ట్యూను లేదు. పేరొందిన గాయకుడు పాడలేదు. అద్భుతం అనిపించే సాహిత్య విలువలూ లేవు. కానీ అందరికీ నచ్చింది. ఈ స్పందనను ముందే వూహించారా అని ధనుష్‌నే అడిగితే సమాధానంగా దీనికోసం ఎలాంటి కసరత్తులు చేయలేదు. ఎలాంటి ప్రణాళికలు వేసుకోలేదు. అన్నీ అనుకోకుండా జరిగిపోయాయి. ఈ పాట నేను రాశాను. తమిళ యాసలో కొన్ని ఇంగ్లీషు పదాలు వ్రాసుకొన్నాను. ఐ, యూ, మి, కౌ, హు పదాలు పడాలనుకొన్నాను. అవి పడ్డాయి. పాట ఎక్కడికో వెళ్లిపోయింది. నాకు ఎనలేని ఖ్యాతి తెచ్చిపెట్టిందని సంతోషంగా చెప్పాడు.

## ఒంపుసొంపుల సుందరిని!



నేను జీరోసైజ్ భామనంటూ మీడియా తెగ ప్రచారం చేసింది. ప్రస్తుతం నన్ను చూసిన వాళ్లెవరూ ఆ మాట అనరంటుంది హీరోయిన్ కరీనా కపూర్. ఈ విషయమై వివరిస్తూ నేను స్లిమ్‌గా వుంటాను. ఎక్కడ వుండాల్సిన ఒంపులు అక్కడుంటాయి. స్త్రీ శరీరంలో ఓ మగాడిని ఆకర్షించేది ఆ ఒంపులే. నా ఒంపు సొంపులు కూడా సైఫ్‌కు బాగా నచ్చాయని మాత్రం కచ్చితంగా చెప్పగలను. సైఫ్‌కు నేను మంచి భార్యనని అందరూ చెప్పుకోవాలి. ఓ బిడ్డను కని అతనికి కానుకగా ఇవ్వాలని భావిస్తున్నట్లు చెప్పుకొచ్చింది.

● పారిశుద్ధ్య విభాగంలో

# అవినీతి కంపు!

కార్పొరేషన్ వివిధ విభాగాల తీరూ తెన్నూ!

నరగ పాలక సంస్థ పారిశుద్ధ్య విభాగంలో అవినీతి కంపు కొడుతోంది. పారిశుద్ధ్యాన్ని మెరుగు పరచేందుకు ఖర్చు చేయాల్సిన లక్షలాది రూపాయల నిధులు దుర్వినియోగం అవుతుం డడంతో నగర ప్రజలకు పారిశుద్ధ్య బాధలు తప్పడం లేదు. చెత్త తరలించేందుకు ఉన్న వాహనాలను తిప్పకుండానే తిరుగుతున్నట్లు లెక్కలు చూపుతూ లక్షల రూపాయలు స్వాహా చేస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. నగరంలో చెత్తను తరలించేందుకు 20 లారీలు, 12 ట్రాక్టర్లు, 27 ఆటోలు, ఐదు డంపర్ ప్లేసర్లు ఉన్నాయి. వీటిలో తిరిగే వాటిని వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. కొందరు సిబ్బంది చెత్తను తరలించేందుకు అన్ని వాహనాలు తిరుగుతున్నట్లు, వినియోగంలో ఉన్నట్లు లెక్కలు చూపుతూ నిధులు స్వాహా చేస్తున్నారు. ఇంధనం పేరున దిగమింగేస్తున్నారు. వాహనాలకు ప్రతి మూడు రోజులకు ఒకసారి ఆయిల్ సరఫరా చేస్తారు. ఒక్కో లారీకి 45 లీటర్లు, ట్రాక్టర్‌కు 38 లీటర్లు, ఆటోలకు 5 లీటర్ల చొప్పున ఆయిల్ అందజేస్తారు. ఉన్నతాధికారుల పర్యవేక్షణ కొరవడడంతో తిరగని వాహనాలకు, మరమ్మత్తులకు గురై ఉన్న వాహనాలకు ఇంధనం కోటాను తీసుకొని స్వాహా చేస్తున్నారట. వాహనాల రిపేర్ల పేరుతోనూ వేలాది రూపాయలు బొక్కేస్తున్నారు. చివరకు కాంట్రాక్టు ఉద్యోగులు తమ చేతివాటం ప్రదర్శిస్తున్నారనే విమర్శలు వినవస్తున్నాయి. మొత్తం మీద పారిశుద్ధ్య విభాగంలో ఉన్నతాధికారుల పర్యవేక్షణ కొరవడడంతో ఆ విభాగంలో వాహనాల పేరిట సొమ్ము దిగమింగడం అధికమైందనే ఆరోపణలు వినవస్తున్నాయి.



పబ్లిక్ హెల్త్ విభాగంలో విధులు నిర్వహించేవారెవరు?

# ఘనంగా అమరజీవి వర్ధంతి


అమరజీవి పొట్టి శ్రీరాములు విగ్రహానికి నివాళులు అర్పిస్తున్న ఆర్యవైశ్య సంఘం నేతలు.

అమరజీవి పొట్టి శ్రీరాములు 59వ వర్ధంతిని 15వ తేది వివిధ సంఘాలు నెల్లూరులో ఘనంగా నిర్వహించాయి. జిల్లా రైస్ కాన్‌వాసింగ్ ఏజెంట్స్ అసోసియేషన్ సభ్యులు స్టోన్‌హౌస్‌పేటలోని అసోసియేషన్ భవనం నుంచి ఊరేగింపుగా బయలుదేరి ఆత్మకూరు బస్టాండ్ వద్దగల పొట్టి శ్రీరాములు విగ్రహం వద్దకు చేరుకొని పూలమాలలు వేసి ఘన నివాళులర్పించారు. ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ కార్యదర్శి కెవి చలమయ్య నేతృత్వంలో మరో బృందం కూడా పొట్టి శ్రీరాములు విగ్రహానికి పూలమాలలు వేసి నివాళులు అర్పించింది. ఈ సందర్భంగా కెవిచలమయ్య మాట్లాడుతూ తెలుగు వారందరికీ ఒక రాష్ట్రం కావాలని 58 రోజులు నిరాహారదీక్ష చేసి ప్రాణత్యాగం చేయడం వల్లే ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిందన్నారు. ఆయన మరణించి 60 ఏళ్లయినా చిత్రపటాన్ని పార్లమెంట్‌లో పెట్టకపోవడం శోచనీయమన్నారు. ఈ కార్యక్రమాల్లో ఆర్యవైశ్య నాయకులు బి.వి.కృష్ణమూర్తి, బి.వి.నరసింహం, ఆర్‌వి సుబ్బారావు, శేగు షణ్ముఖరావు, రాజా నరసింహారావు, పి.వి.శేషగిరిరావు, కె.వి.సుబ్రహ్మణ్యం తదితరులు పాల్గొన్నారు.

# రేషన్‌షాపు డీలర్లపై మండిపాటు

డిఎస్‌ఓకు కోపం వచ్చింది

జిల్లాలోని రేషన్‌షాపు డీలర్లపై పౌరసరఫరాల శాఖాధికారి మండిపడ్డారు. తొలి, రెండవ విడత రచ్చబండ కార్యక్రమం సందర్భంగా రేషన్ కూపన్లు కొందరు డీలర్లు లబ్ధిదారులకు అందించలేదు. ఈ విషయంపై డిఎస్‌ఓకు అనేక ఫిర్యాదులు అందడం, ప్రతి రోజూ రూపాయి కిలో బియ్యం పథకంపై పత్రికల్లో కథనాలు రావడంతో ఆయన స్పందించక తప్పలేదు. జిల్లాలోని డీలర్లందరినీ సమావేశ పరచి రేషన్ కూపన్ల పంపిణీ తీరుపై ప్రశ్నల వర్షం కురిపించారు. కార్డులకు బదులు కూపన్లను అందించాలని ఆదేశించి నెల రోజులు గడిచినప్పటికీ కొందరు డీలర్లు నిర్లక్ష్యంగా వ్యవహరించడంపై ఆగ్రహం వ్యక్తం చేశారు. డీలర్ల వద్దనే కూపన్లు ఉంచుకొని సరుకులను స్వాహా చేస్తున్న వారిపై కఠిన చర్యలు తీసుకుంటామని హెచ్చరికలు చేశారు.

● మనీ సర్క్యులేషన్ స్కీంలో

# మలుపులు!

పేదల నోరుకొట్టి కోట్లకు పడగలెత్తాలనుకొన్న మనీ సర్క్యులేషన్ స్కీం నిర్వాహకులపై సిఐడి చేపట్టిన దర్యాప్తులో ఎన్నో మలుపులు, మరెన్నో కొత్త కొత్త అంశాలు వెలుగు చూస్తున్నాయి. తీగలాగితే డొంక కదిలిందన్న సామెతగా కొత్త సంస్థలు, సమాజంలో గౌరవప్రదమైన స్థానంలో ఉన్న ఉద్యోగులు, వ్యాపారులు ఎందరో ఈ చైన్ లింక్ స్కీంలో పాత్రధారులు కావడం అధికారులనే ఆశ్చర్యపరుస్తోంది. హిమ్, న్యూవిజన్ ఫౌండేషన్, యంగ్ అండ్ స్ట్రైంగ్త్ తదితర సంస్థలపై ఫిర్యాదులు రావడంతో పోలీస్ ఉన్నతాధికారులు సిఐడికి దర్యాప్తు బాధ్యత అప్పగించిన నాటి నుంచి లోతైన దర్యాప్తు చేపట్టడంతో ఎన్నో కొత్త కోణాలు వెలుగు చూస్తున్నాయి. సమాజంలో గౌరవప్రదమైన స్థానంలో ఉంటూ విద్యార్థులను తీర్చిదిద్దాల్సిన ఉపాధ్యాయులు ఏజెంట్ల అవతారం ఎత్తి కోట్లాది రూపాయలు పేదల నుంచి వసూలు చేసి ఉన్నారు. దేవుడిగా పూజించే వైద్యులు కాసులకు కక్కుర్తిపడి వైద్యవృత్తి ప్రక్కనపెట్టి పేదల నుంచి అధికంగా డబ్బులు దండారు. ఇక నేరాలను అరికట్టాల్సిన పోలీసులే ఏజెంట్లుగా మారి పెద్ద మొత్తంలో దండకాలు చేసి ఉండడాన్ని చూసిన సిఐడి అధికారులు ఆశ్చర్యపోతున్నారు. ఎంత మందిని అరెస్ట్ చేస్తున్నప్పటికీ వీరి జాబితా కొండవీటి చాంతాడంత ఉండడం వారిని ఇబ్బంది పెడుతుంది.

# పట్టుకోసం ప్రయత్నాలు!

డిఎంఅండ్‌హెచ్‌ఓ ప్రయత్నం నెరవేరేనా?

జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిగా బాధ్యతలు చేపట్టిన మాశిలామణి మరుసటి రోజు నుంచి జిల్లావ్యాప్తంగా ఆస్పత్రుల తనిఖీలకు వెళ్తున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఆకస్మికంగా తనిఖీలు చేపట్టి సిబ్బంది పనితీరుపై ఆరా తీస్తున్నారు. రోగులకు వైద్య సేవలు అందించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన వారిపై కఠిన చర్యలు తీసుకుంటామని హెచ్చరికలు చేస్తున్నారు. ఇప్పటికే దాదాపు జిల్లాలోని 25 మండలాల్లో తనిఖీలు చేశారాయన. మొన్నటి వరకు ఉదయగిరిలో ప్రభుత్వ వైద్యుడిగా విధులు నిర్వహించిన మాశిలామణి ఇతర వైద్యులతో చాలా సన్నిహితంగా మెలిగేవారు. పదోన్నతిలో భాగంగా జిల్లా అధికారిగా నియమితులైనారు. సన్నిహితుడే జిల్లా అధికారిగా రావడంతో ఇతర వైద్యులు పెద్దగా పట్టించుకోవడం మానేశారు. ఇతర వైద్యులతో కలిసి పని చేసినప్పటికీ జిల్లాస్థాయి అధికారి హోదాలో పనిచేయని వైద్యులపై చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఏర్పడింది. దీంతో సన్నిహితంగా మెలిగిన వైద్యుల్లో ఆందోళన మొదలైంది. మాశిలామణి వైద్య శాఖపై పట్టు కోసం ప్రయత్నిస్తున్నా క్రిందిస్థాయి సిబ్బంది ఏమాత్రం సహకరించడంలేదన్న విమర్శలు వినిపిస్తున్నాయి.

# నకిలీలతో రైతుల విలవిల!

● ఆదుకొనేవారెవరు?

జిల్లా రైతాంగాన్ని నకిలీల బెడద వెన్నాడుతోంది. విత్తనాలు మొదలు ఎరువులదాకా సర్వం నకిలీల మయం కావడంతో రైతాంగం ఆ ఉచ్చులో చిక్కుకొని విలవిల్లాడుతోంది. పురుగు మందులు, ఎరువులు, విత్తనాలను దుకాణాదారులు నకిలీవి విక్రయిస్తుండడంతో రైతాంగం కోలుకోలేని విధంగా నష్టపోతోంది. దీనికితోడు అధిక ధరలు రైతుల నడ్డి విరుస్తున్నాయి. దీంతో వ్యవసాయం రైతాంగానికి కత్తిమీద సాములా పరిణమిస్తోంది. జిల్లావ్యాప్తంగా విత్తనాలు అమ్మే దుకాణాలు రెండు వందలకు పైగా ఉండగా, ఎరువుల అంగళ్లు మూడు వందలకు పైగా ఉన్నాయి. పురుగు మందులు అమ్మే షాపులు రెండొందల వరకు ఉన్నాయి. వ్యవసాయ శాఖాధికారులు ఈ దుకాణాలను తరచూ తనిఖీ చేయాల్సి ఉండగా ఆ సంగతి అధికారులు ఏనాడో మరచిపోవడం, లంచాల సొమ్ముకు అలవాటుపడడంతో షాపుల యాజమాన్యాలు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ నకిలీ ఎరువులు, మందులు, విత్తనాలను విక్రయిస్తూ జేబులు నింపుకొంటూ రైతుల జీవితాలతో చెలగాటమాడుతున్నాయి. గత ఏడాది విజిలెన్స్ అధికారులు జరిపిన తనిఖీల్లో పలు అక్రమాలు వెలుగు చూశాయి. టన్నులకొద్దీ ఎరువుల అక్రమ నిల్వలు, నకిలీ విత్తనాలు, పురుగు మందుల విక్రయం బహిర్గతమైంది. ఇంత జరిగినా వ్యవసాయ శాఖాధికారుల్లో చలనం ఉండడం లేదు. కృత్రిమ కొరతను సృష్టించి అధిక ధరలకు విక్రయిస్తున్నా, నకిలీలు మార్కెట్‌లో జోరుగా చలామణిలో ఉన్నా పట్టించుకొనే నాధుడే కరువవడంతో రైతులు వ్యాపారుల మోసానికి, ప్రకృతి కోపానికి బలైపోతున్నారు. నష్టాల పాలవుతున్నారు. రైతుల బాగోగులను దృష్టిలో ఉంచుకునైనా నకిలీ విత్తనాలు, ఎరువులు, పురుగు మందుల విక్రయాలపై కఠిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆ దిశగా వ్యవసాయాధికారులు శ్రద్ధపెట్టేలా కలెక్టర్ చొరవచూపాలని పలువురు కోరుకొంటున్నారు.


బుచ్చి కోదండరామస్వామి దేవస్థానం ధర్మకర్త దొడ్ల మురళీకృష్ణారెడ్డి కుమార్తె పుష్పజ, సాయి వరుణ్‌ల వివాహం డిసెంబర్ 1తేది నెల్లూరు సిపిఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.


నెల్లూరు మాగుంటలేఅవుట్‌లోని వేదవ్యాస స్కూల్‌లో ఏర్పాటుచేసిన పర్యావరణ పరిరక్షణ అవగాహన కార్యక్రమంలో తాము తయారుచేసిన నమూనాలను ప్రదర్శిస్తున్న విద్యార్థినీ, విద్యార్థులు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

నాడు ప్రభుత్వం జీవిత సాఫల్య పురస్కారాన్ని ప్రకటించింది. చెన్నైలోని ఎంజిఆర్ మెడికల్ కాలేజి వార్షికోత్సవాలను పురస్కరించుకొని ఏర్పాటుచేసిన సభలో ఈ అవార్డును తమిళనాడు గవర్నర్ శ్రీ కొణిజేటి రోశయ్య డాక్టర్ రాజశేఖర్‌రెడ్డికి అందించారు. మెడికల్ యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ డాక్టర్ నటరాజన్, తమిళనాడు ఆరోగ్య శాఖా మంత్రి డాక్టర్ విజయ్ కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

డాక్టర్ రాజశేఖర్‌రెడ్డి కావలిలో పేరుగాంచిన ప్రజావైద్యుడు డాక్టర్ సి.లక్ష్మీనరసారెడ్డి కుమారుడు. లండన్‌లో వైద్య విద్య అభ్యసించినా స్వదేశం వచ్చి స్థిరపడ్డాడు. ఆనం భక్తవత్సలరెడ్డి కుమార్తె డాక్టర్ తనూజారెడ్డిని వివాహం చేసుకొన్నారు.

## వేదవ్యాస స్కూల్‌లో పర్యావరణ పరిరక్షణ!

నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస హైస్కూల్‌లో 19వ తేది పర్యావరణ పరిరక్షణపై అవగాహన కార్యక్రమాన్ని ఏర్పాటుచేశారు. నదులు, సముద్రాలు, బావులు ఎలా కలుషితమవుతున్నాయి. దీనికి కారణాలు, పరిష్కారాలను నమూనాల రూపంలో ప్రదర్శించారు. ప్లాస్టిక్ పదార్థాల వల్ల భూమికి ఏవిధంగా హాని కలుగుతుంది, ధ్వని వలన కలిగే అనర్థాలు, వ్యర్థపదార్థాలను ఏవిధంగా తిరిగి వినియోగించుకోవాలనే నమూనాలను ప్రదర్శనలో ఉంచారు. ఈ కార్యక్రమంలో విద్యార్థుల తల్లితండ్రులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ఉత్తమ నమూనాలు ప్రదర్శించిన విద్యార్థులకు కరస్పాండెంట్ ఎపిబాలాజీ బహుమతులు పంచారు.

## నెల్లూరులో తాజ్‌మహల్!

నెల్లూరు వైఎంసిఏ గ్రౌండ్‌లో హ్యాండ్‌ల్యూమ్ హ్యాండీక్రాఫ్ట్ ఎగ్జిబిషన్‌ను పురస్కరించుకొని దాని నిర్వాహకులు తాజ్‌మహల్‌ను పోలిన కట్టడాన్ని ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో రూపొందించారు. ఇక్కడ ఏర్పాటుచేసే ఎగ్జిబిషన్‌లో రకరకాల గృహోపకరణాలు, వస్త్రాలు, పిల్లలు ఆటలాడుకొనే వస్తువుల స్టాల్స్‌తోపాటు అందరికీ ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగించే వాతావరణాన్ని ఏర్పాటుచేసి నెల్లూరుకు ముందే పండుగల శోభను తెచ్చామంటున్నారు నిర్వాహకులు ఎండి రాజారెడ్డి, షేక్ బాబు.

## కావలిలో టెన్నిస్ పోటీలు

ఆల్ ఇండియా సీనియర్ టెన్నిస్ ర్యాంకింగ్ ఛాంపియన్ షిప్ పోటీలు కావలి అఫిషియల్ క్లబ్‌లో జనవరి 3 నుంచి 8వ తేది వరకు జరుగుతాయి. పాల్గొనగోరే క్రీడాకారులు డిశంబర్ 29వ తేదిలోగా తమ పేర్లను నమోదు చేసుకోవాలి. విజేతకు లక్ష రూపాయలను బహుమతిగా ఇవ్వనున్నట్లు టోర్నీ నిర్వాహకుడు డాక్టర్ సి.లక్ష్మీనరసారెడ్డి చెప్పారు. ఎంట్రీలను officialclubofkavalitennis@yahoo.in కు మెయిల్ పంపాలన్నారు.

## 10లక్షలు నష్టపరిహారం చెల్లించాలి

రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్ నిర్లక్ష్యం కారణంగా హెచ్ఐవి సోకిన బాధితురాలికి 10లక్షల రూపాయలు నష్టపరిహారం చెల్లించాలని పౌరహక్కుల సంఘం, నిజనిర్ధారణ కమిటీ డిమాండ్ చేసింది. చేసిన తప్పును కప్పిపుచ్చుకొనే యత్నం చేస్తున్న రెడ్‌క్రాస్ ఘటనపై న్యాయవిచారణ జరిపించి నిజానిజాలు నిగ్గుతేల్చాలని, బాధితులకు ప్రభుత్వమే అండగా నిలవాలని, బ్లడ్‌బ్యాంక్ కమిటీని మార్చాలని సంఘ నేతలు డాక్టర్ విజయ్‌కుమార్, ఎల్లంకి వెంకటేశ్వర్లు తదితరులు డిమాండ్ చేశారు.

## ఆనం సోదరులకు రోజులు దగ్గరపడ్డాయి!

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పుణ్యాన ఆర్థికంగా, రాజకీయంగా ఎదిగిన ఆనం సోదరులు నేడు జగన్, విజయమ్మలను విమర్శించడం సిగ్గుచేటని ఉదయగిరి శాసనసభ్యుడు, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేత మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి విమర్శించారు. నిన్నమొన్నటి వరకు వైఎస్ భజన చేసినవారు ఇప్పుడు ప్లేటు ఫిరాయించడం వారి అవకాశవాద రాజకీయాలకు నిదర్శనం అన్నారు. వారికి రోజులు దగ్గరపడ్డాయని, ప్రజలు బుద్ధి చెప్పే సమయం ఆసన్నమైందన్నారు.

## లాంతర్లతో నిరసన

ఎడాపెడా విద్యుత్‌కోతలను నిరసిస్తూ బిజెపి లాంతర్లతో వినూత్న నిరసన చేపట్టింది. కలెక్టరేట్ వద్ద డిసెంబర్ 17వ తేది చేపట్టిన ధర్నాలో నేతలు ప్రభుత్వ తీరుపై విరుచుకపడ్డారు. ముందస్తు ప్రణాళిక లేకుండా వ్యవహరించడం వల్లనే శీతాకాలంలోనూ ఐదు గంటలపాటు విద్యుత్ కోత ఉంటున్నదని విమర్శించారు. రైతులు, విద్యార్థులు, వ్యాపారులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారన్నారు. ఈ కార్యక్రమంలో బిజెపి నేతలు రమేష్, శ్రీనివాసులు, అంకయ్య తదితరులు పాల్గొన్నారు.

## దొంగతనాల జోరు

నగరంలో దొంగతనాల జోరు అధికమయ్యింది. కాపువీధిలో నివాసం ఉంటున్న ఇరుగాళమ్మ దేవస్థానం ఛైర్మన్, ఆనం వివేకానందరెడ్డి శిష్యుడు నరేంద్ర ఇంట్లో భారీ దొంగతనం జరిగింది. కుటుంబసభ్యులు ఊరికివెళ్లిన సమయంలో డిసెంబర్ 17వ తేది దొంగలుపడి ఆయన ఇంట్లోని 79 సవర్ల నగలు, పది లక్షల రూపాయల నగదు, వెండి సామాన్లు దొంగిలించుకొని వెళ్లినట్లు సమాచారం.

## రియల్ వ్యాపారి హత్య

మాగుంట లేఅవుట్‌లో నివాసం ఉంటున్న రియల్ ఎస్టేట్ వ్యాపారి రాఘవరెడ్డి హత్యకు గురయ్యాడు. వ్యాపారలావాదేవీల్లో తలెత్తిన వివాదాల నేపథ్యంలో బంధువులే అతన్ని రాపూరు వద్ద హత్యచేసిన కడప జిల్లాలోని బద్వేల్ పెద్ద చెరువులో పడేశారు. దీనిపై రాఘవరెడ్డి కుమారుడి ఫిర్యాదుతో దర్యాప్తు చేపట్టిన పోలీసులు చెరువులో ఉన్న శవాన్ని బయటకు తీశారు. నిందితులను పట్టుకొన్న పోలీసులు వారి నోటే నిజాలు చెప్పించడంతో హత్యకేసు కొలిక్కి వచ్చింది.

## రాజకీయశక్తిగా శ్రీధర్

16వ పేజీ కొరవ

నిషేధం పేరిట సర్వేపల్లిలో వీధి వీధి కాలినడకన తిరిగాడు. దాని ఫలితం ఆయనకు రెండు ఎన్నికలలో కన్పించింది. ఆనం రామనారాయణరెడ్డి నిరాహార దీక్షచేసి రాపూరులో తనను తాను బ్రతికించుకొన్నాడు. ఇప్పుడు శ్రీధర్‌రెడ్డికి కూడా ఈ పాదయాత్ర మృత సంజీవనీ మూలిక వలె పనిచేస్తుందేమో వేచి చూద్దాం.

# పెన్షన్ల కోసం నిరీక్షణ

**వృద్ధాప్య, వితంతు, వికలాంగుల పెన్షన్లు డిశంబరు నెలలో ఇవ్వకపోవడంతో ఈ వర్గాలు ఇబ్బందులు పడుతున్నాయి. అధికారులు మాత్రం రచ్చబండ కార్యక్రమం మూలంగా నిధుల విడుదలలో ప్రతిష్టంబన ఏర్పడిందంటున్నారు.**



పెన్షన్లు అందుకొనేందుకు ప్రతినెల బారులుతీరే వయోవృద్ధులు(ఫైల్‌ఫోటో).

జిల్లాలో ప్రతినెల అందిస్తున్న సాంఘిక భద్రత పెన్షన్లు డిసెంబర్ నెలలో అందకుండాపోయాయి. వృద్ధాప్య, వితంతు, వికలాంగుల పెన్షన్లు అందకపోవడంతో లబ్దిదారులు తీవ్రంగా ఇబ్బంది పడుతున్నారు. జిల్లాలో ఈ పథకం అమలు బాధ్యతలను చూస్తున్న గ్రామీణాభివృద్ధి – ఇందిర క్రాంతిపథం అధికారులు సమాధానం చెప్పలేకపోతున్నారు. గత నెలలో నిర్వహించిన రచ్చబండ కార్యక్రమం సందర్భంగా పెన్షన్లు పంపిణీకి సంబంధించిన నివేదికలు అందకపోవడంతో డిసెంబర్ నెలలో పెన్షన్లు పంపిణీ చేయలేక పోయినట్లు అధికారులు చెబుతున్నా లబ్దిదారులు నమ్మలేని పరిస్థితి ఏర్పడింది. 2వ విడత రచ్చబండలో జిల్లాలో 50వేల మందికి పైగా కొత్తగా పెన్షన్లు అందించినట్లు అధికారులు ప్రకటించడం విశేషం.

తొలుత ఈ పెన్షన్లు గ్రామపంచాయితీ కార్యదర్శులు గ్రామాల్లో పంపిణీ చేసేవారు. అక్రమాలు జరుగుతున్నాయన్న కారణంతో ఇందిర క్రాంతి పథం సిబ్బంది ఆధ్వర్యంలో పొదుపు సంఘాల ద్వారా పంపిణీకి శ్రీకారం చుట్టింది. వీరిపై కూడా పలు ఆరోపణలు రావడంతో బ్యాంకులను ఏజెన్సీగా నియమించి స్మార్టు కార్డుల ద్వారా ప్రస్తుతం అన్నిరకాల పెన్షన్లు పంపిణీ చేస్తున్నారు. స్మార్టు కార్డుల విధానం ద్వారా వృద్ధులు పలు ఇక్కట్లు పడుతున్నారు. వ్రేలిముద్రలు సక్రమంగా వేయలేకపోవడంతో సాంకేతికపరమైన సమస్యలు తలెత్తుతున్నాయి. పెన్షన్ల పంపిణీకి సంబంధించి రాష్ట్రప్రభుత్వం ఎన్ని నిబంధనలు విధించినప్పటికీ అక్రమాలు మాత్రం జరుగుతూనే వున్నాయి.

మండలస్థాయి నుంచి అందుతున్న జాబితా ప్రకారం జిల్లా గ్రామీణాభివృద్ధిశాఖ పెన్షన్లకు నిధులు విడుదల చేస్తుంది. జాబితాల్లో మరణించిన వారి పేర్లున్న వాటి గురించి ఏ ఒక్కరూ పట్టించుకోవడం లేదు. మరణించిన వారి పేర్ల మీద పెన్షన్లు పంపిణీ జరిగిపోతోంది. ఈ తంతు అన్ని మండలాల్లో కొనసాగుతుంది. అర్హులకు బదులు అనర్హులకు పెన్షన్లు అందిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి. వీటిని సరిదిద్దాల్సిన సంబంధిత అధికారులు సరైన పరిశీలన చేయడం లేదు. అర్హులైన లబ్దిదారులు పెన్షన్లు అందక లబోదిబోమని విలపిస్తున్నా పట్టించుకునే నాథుడే కరువయ్యారు. రచ్చబండ కారణం చూపి డిసెంబర్ నెల పెన్షన్లు నిలిపి వేయడంపై అనేక సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. సంక్షేమ పథకాలకు పెద్దపీట వేస్తున్న ప్రభుత్వం భవిష్యత్తులో వేలాది రూపాయల పెన్షన్లు అందిస్తామని ప్రకటించింది. ప్రస్తుతం అందించే పెన్షన్ సక్రమంగా ఇవ్వలేక పోవడంతో వెయ్యిరూపాయల పెన్షన్ ఎలా అందిస్తుందని ప్రశ్నిస్తున్నారు ప్రజలు. రాష్ట్రప్రభుత్వం ఆర్థిక వనరులను సమీకరించుకోలేక పోవడం వలన పెన్షన్ నిధులు విడుదల చేయలేకపోయిందని మరో వాదన ప్రచారంలో వుంది. డిసెంబర్ ఆఖరుకు మూడో త్రైమాసికం ముగియనుంది. రాష్ట్రప్రభుత్వం ప్రభుత్వశాఖలకు సంబంధించిన నిధులను ప్రతి మూడు నెలలకోసారి విడుదల చేయడం ఆనవాయితీ. ప్రభుత్వ లెక్కల ప్రకారం డిసెంబర్ నెలకు సంబంధించిన పెన్షన్ నిధులు ఇప్పటికే విడుదల చేసి వుండాలి.

మూడో త్రైమాసికం ముగియక ముందే నిధుల కొరత ఏర్పడి పెన్షన్ల పంపిణీ నిలిచిపోయింది. అధికారులు మాత్రం రచ్చబండ కార్యక్రమం కారణంగా నిధులు విడుదల్లో జాప్యం జరిగిందంటున్నారు. వచ్చే నెలలో కూడా పెన్షన్లు అందుతాయో లేదన్నది ప్రశ్నార్థకంగా మారింది.

# ఆనమోల్ల అరాచకాలను అడిగేవాడే లేడు!

### అధికార మదాంధులతో విరోధం

11వ పేజీ కొరవ

*మిత్రులే, శత్రువులు!*

ఇప్పుడు ఆనం వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డిలతో యుద్ధం జరుగుతున్నది. వారిద్దరూ 'జమీన్‌రైతు'కు, సంపాదకుడిగా నాకు సన్నిహిత స్నేహితులు. దాదాపు ముప్పయ్యేళ్లు ఆ సాంగత్యం నడిచింది. కానీ అధికారం చేతికి రాగానే పరిస్థితి మారిపోయింది. పత్రికలు తమ తప్పులు ఎత్తి చూపినప్పుడు వాటిని సరిదిద్దుకోవడం, విమర్శను సహృదయంతో స్వీకరించడం, ఒకవేళ పత్రికలు వ్రాసింది తప్పు అయితే సర్దుబాటు ప్రచురణ చేయమని కోరడం రాజకీయవాదికి వుండవలసిన లక్షణం. కానీ అధికార మదంతో రాక్షసీయంగా మారిపోయిన ఆనం సోదరులు తమ మీద విమర్శలు చేసే పత్రికలను తమ శత్రువులుగా భావిస్తున్నారు. ఆ పత్రికలను, ఆ విలేకరులను అణిచిపారేయాలనే కక్షతో ప్రవర్తిస్తున్నారు. ఈ దుర్మార్గ వైఖరి 'జమీన్ రైతు' మీద ప్రయోగించాలని చూడడం వారి వెర్రితనం. అటువంటి ఉడత వూపులకు బెదిరే కుందేళ్లు ఇక్కడ లేవన్న నిజం వారికి బాగా తెలుసు. కానీ అధికారమనే మత్తు వారి కళ్లకు పొరలు క్రమ్మేట్లు చేస్తున్నది. తమ అరాచకాలను ప్రశ్నించడం, దౌర్జన్య పోకడను నిరసించడమే 'జమీన్‌రైతు' చేస్తున్న నేరంగా భావిస్తున్నారు వారిద్దరూ.

*అందరూ దాసోహం*

దురదృష్టవశాత్తు నెల్లూరు జిల్లా రాజకీయ వాదులందరూ, అన్ని పార్టీల వారూ ఆనం సోదరుల అధికార దర్పానికి దాసోహం అంటున్నారు. వారితో పేచీ పెట్టుకొంటే తమ వ్యాపారాలు, వ్యాపకాలకు ఇబ్బంది అనే భయంతో ప్రతిపక్ష బాధ్యత కూడా మరచిపోయి కళ్లు మూసుకొని వుంటున్నారు. వారి దుర్మార్గ పోకడను నిరసిస్తూ, ప్రశ్నిస్తున్న సంస్థ 'జమీన్‌రైతు' పత్రిక ఒక్కటే. దానికి ప్రతీకారంగా అన్నదమ్ములు మామీద ఎన్నో ఒత్తిడులు తెచ్చారు. బెదిరింపులకు దిగారు. వ్యక్తిగత జీవితాలనూ దెబ్బ తీయాలని చూస్తున్నారు. పత్రికకు ప్రకటనలివ్వ వద్దని అటు అధికారులకు, ఇటు అనుచరులకు ఆంక్షలు పెట్టారు. అయినా 'జమీన్ రైతు' రాజీ పడలేదు. అదే సమయంలో వారి వ్యక్తి గత జీవితానికి సంబంధించి ఎన్ని సంఘటనలు మా దృష్టికి వచ్చినా సంస్కారం కాదనే నియమంతో నిగ్రహం పాటిస్తున్నాము. వారి మీద మా విమర్శలు రాజకీయ, ప్రజాపరమైనవే తప్ప ఒక్క వార్త కూడా వ్యక్తిగతం కాదు.

*రాజ్యాంగేతర శక్తి*

భానుశ్రీ దాఖలు చేసిన పరువు నష్టం కేసు ఈ పరిణామ క్రమంలో ఒక భాగం. భానుశ్రీ మీద మాకెటువంటి ద్వేషం, దురభిమానం, కక్ష, కార్పణ్యం లేవు. అసలామెతో మాకు ముఖ పరిచయం కూడా లేదు. ఆనం వివేకానందరెడ్డితో తనకున్న సాన్నిహిత్యాన్ని అడ్డు పెట్టుకొని నెల్లూరు నగరంలో ఒక రాజ్యాంగేతర శక్తిగా వ్యవహరిస్తున్న ఆమె తీరును 'జమీన్‌రైతు' ఎప్పటికప్పుడు ఎండగడుతున్నది. అవి ప్రజాహితం కోసం చేస్తున్న విమర్శలే తప్ప ఆమె మీద కోపంతో కాదు. సాధారణంగా ఇటువంటి సందర్భాలలో పత్రికలు విమర్శలు చేసినప్పుడు, మరొకసారి ఆ తప్పు చేయకుండా జాగ్రత్త పడుతూ వుంటారు రాజకీయవాదులు. కానీ భానుశ్రీ, వివేకానందరెడ్డి లిద్దరూ తాము చేస్తున్నది తప్పన్న నిజాన్ని అంగీకరించడానికి ఇష్టపడడం లేదు. ఎంత వ్రాస్తే, ఎంత విమర్శ చేస్తే అంతకు రెట్టింపు విచ్చలవిడితనాన్ని ప్రదర్శిస్తున్నారు. అరాచకశక్తులుగా మారి నెల్లూరు ప్రజల మానం తీస్తున్నారు. ప్రజాధనం లూటీ చేస్తున్నారు. ఏమి వ్యాపారాలు చేస్తే, వాటిలో ఎంత లాభాలు గడిస్తే భానుశ్రీకి ఈరోజున్న కోట్లాది రూపాయల ఆస్తి సమకూరింది? వివేకానందరెడ్డికి జమీన్‌దారీ స్థాయిలో విలాసాలు నడుస్తున్నాయి?

*పబ్లిక్‌లోకి వస్తే... టాం... టాం...*

వ్యక్తుల ప్రైవేటు జీవితాలు వారి స్వంతం. కానీ పబ్లిక్‌లోకి వస్తే ఏమైనా అంటాం... టాం... టాం... అన్నాడు మహాకవి శ్రీశ్రీ ఒకసారి. భానుశ్రీ, వివేకానందరెడ్డిల వ్యక్తిగత జీవితంలోకి ఏనాడూ ప్రవేశించే ప్రయత్నం చేయలేదు 'జమీన్‌రైతు'. కానీ ప్రజల మధ్య వారి ప్రవర్తన, ప్రజా నిధులలో వారి ప్రమేయం, ప్రజాస్వామిక సాంప్రదాయాల విషయంలో వారి విశృంఖలత్వాలను ఎప్పటికప్పుడు ప్రశ్నించాము. నిరసించాము. ఇక ముందు కూడా ప్రశ్నిస్తూనే వుంటాము.

*తరాలు మారినా తీరు మారలేదు*

అధికారంలో లేనంత కాలం జిల్లా రాజకీయ వాదులంతా 'జమీన్‌రైతు'కు ఆప్తమిత్రులు. అది చేతికి రాగానే ఆగర్భ శత్రువులు. ఈ పోకడ 'జమీన్‌రైతు' పుట్టిన నాటి నుంచి నడుస్తూనే వుంది. తరాలు మారినా ఆ సాంప్రదాయం కొనసాగుతూనే వుంది. దాదాపు ఒక శతాబ్దకాలం 'జమీన్‌రైతు' పాఠకాదరణ నిలబెట్టుకోగలగడానికి ఇదే కారణం. ఇదే హేతువు. అధికారంలో వున్నవారితో వివాదాలు, విరోధాలు మాకలవాటే. వాటికి భయపడేది లేదు. బాధపడేదీ లేదు.

పత్రిక సమాజంలో అంతర్భాగం. ప్రజాస్వామ్యానికి ఒక ఉపకరణం. సామాజిక బాధ్యతను భుజానకెత్తుకోగల్గిన వాడే పత్రిక నిర్వహణ చేపట్టాలి. సమాజానికి అవసరమైన ప్రతి అంశం మీదా స్పందన చూపడమే సామాజిక బాధ్యత. ప్రజలను చైతన్యం చేయడమే ప్రజాస్వామిక ధర్మం. మీరు వ్రాసే వార్తలు, వ్రాతల వల్ల వివేకానందరెడ్డి వంటి సమాజ భ్రష్టులలో మార్పు వస్తుందా అన్న ప్రశ్న కొందరు పాఠకుల నుంచి ఎదురౌతున్నది. అధికారం, అవినీతి, అహంకారాలతో చర్మం మొద్దుబారిన వారికి వార్తలనే చెర్నాకోల దెబ్బలు, దున్నపోతు మీద వాన కురిసిన చందంగా వుంటాయి. కానీ ప్రజా చైతన్యమనే బ్రహ్మాస్త్రం తగిన సమయంలో తన శక్తి చూపుతుంది. అందుకు ఓర్పు కావాలి. జైలు శిక్షలు, జరిమానాలకు వెరిస్తే, సమాజం పట్ల పాత్రికేయుడిగా వున్న బాధ్యతను సక్రమంగా నిర్వర్తించలేము.

–డోలేంద్ర

# రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌ను సీజ్ చేశారు!

నెల్లూరు వెంకటేశ్వరపురానికి చెందిన యువతి హసీనాకు హెచ్‌ఐవి సోకేందుకు కారణమైన నెల్లూరు రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌ను జిల్లా అధికార యంత్రాంగం సీజ్ చేసింది. కలెక్టర్ ఆదేశాల మేరకు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ మాసిలామణి, ఆర్డీఓ మాధవీలత 21తేదీ సాయంత్రం రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌కు చేరుకొని రికార్డులను సీజ్ చేయడంతోపాటు కార్యాలయానికి తాళాలు వేశారు.

అత్యవసర సమయంలో ప్రాణాలను నిలిపే రక్తమే ప్రాణాంతకంగా మారుతుండడంతో ప్రజల్లో ఆందోళన వ్యక్తమయ్యింది. ఏ పాపము ఎరుగక కేవలం రక్తం ఎక్కించుకొన్నందుకు జీవితాన్ని ఛిద్రం చేసుకొనే పరిస్థితి తలెత్తడంతో ఆ అభాగ్యుల మనసు పడే వేదన నరకయాతనే. దీనికి కారణం రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంక్ కావడం సంచలనం కల్గించే అంశం. దాతల సహకారంతో ఆర్థికంగా ఎలాంటి సమస్యలు లేకపోయినా కొందరు ఏళ్లతరబడి కన్వీనర్ల పేరుతో పాతుకుపోయి వుండడం, ఇష్టానుసారంగా ప్రవర్తిస్తుం డడంతో గత కొంతకాలంగా అంతర్గత కుమ్ములాటలతో భ్రష్టుపట్టిపోయింది రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్. ఇంటర్నేషనల్ స్టాండర్డ్స్‌తో నడిచే సంస్థగా చెప్పబడే నెల్లూరు రెడ్‌క్రాస్‌లో తరచి చూస్తే అన్నీ లొసుగులే కన్పిస్తున్నాయి. రక్తం తీసుకొనేటప్పుడు పాటించాల్సిన నియమ నిబంధనలను ఏనాడో గాలికొదిలేశారు. అధిక సంఖ్యలో రక్తదాతలు వున్నప్పుడు ప్రాథమిక పరీక్షలు చేయకుండానే రక్తం సేకరిస్తున్నారట. లక్షలాది రూపాయలు నిధులున్నా వాటితో పాలిమరైజ్ చైన్ రియాక్షన్(పిసిఆర్) టెస్టు, వెస్టన్‌బ్యాట్ టెస్టులు చేయకుండా కేవలం ఎలీసా, ట్రైడాట్ టెస్టులతోనే సరిపుచ్చుతున్నారు. దీనికి డబ్బులులేవని చెప్తున్న కార్యదర్శి, బ్లడ్‌బ్యాంక్ కన్వీనర్లు బ్లడ్‌బ్యాంక్‌లో స్పాస్టిక్ సెంటర్‌లో నిఘా కెమెరాలు బిగించేందుకు మాత్రం డబ్బుల సమస్య రాకపోవడంపై విమర్శలు వ్యక్తమవుతున్నాయి. ఒకస్థాయి డయోగ్నొస్టిక్ సెంటర్లు సైతం హెచ్‌ఐవి పరీక్ష చేసేందుకు ఫోర్త్ జనరేషన్ పరికరాలను వినియోగిస్తున్న సమయంలో రెడ్‌క్రాస్ లాంటి సంస్థలు వాడక పోవడంపై పలు అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. రక్తంలోని ప్లాస్మాను కొరియా తదితర దేశాలకు సరఫరా చేస్తూ పెద్ద ఎత్తున ఆదాయం సమకూర్చుకొంటున్న సంస్థ ఆ నిధులను ఏమి చేస్తున్నది అంతుపట్టని ప్రశ్నగా మిగిలింది. ఇక రక్తం సేకరించినపుడు వందలో 15 నుంచి 20 యూనిట్లు వృధా అవుతుంటాయి. మలేరియా, టైఫాయిడ్, హెపటైటిస్ – బి, సి, సెక్సువల్ ట్రాన్స్‌ఫర్ డిసీజెస్ (ఎస్‌టిడి) తదితర జబ్బుల లక్షణాలు బయటపడితే ఆ రక్తం పనికిరాదు. అయితే ఇటువంటి వృధా అయిన రక్తాన్ని ఏమి చేస్తున్నారు? దానిని పారేస్తున్నారా? ఎలా ధ్వంసం చేస్తున్నారు అనేది అంతుపట్టడం లేదు. ఇలాంటి వాటన్నింటికీ సెక్రటరీ, కన్వీనర్ల వద్ద సమాధానాలు లేవు. గతంలోనూ బుచ్చిరెడ్డిపాళెంకు చెందిన మహిళకు రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్ ఇచ్చిన రక్తం ఎక్కించడం వలన హెచ్‌ఐవి సోకడంతో గందరగోళం జరిగినా తమ పలుకుబడితో ఇది బయటకు రానీయకుండా చేశారట. ఇప్పుడు వెంకటేశ్వరపురంకు చెందిన మహిళ విషయంలో మరోసారి ఈ పొరపాటు జరిగింది. ఈ సంస్థ సేకరించే రక్తం, దాతల వివరాలు, సేకరణ సమయంలో చేసే పరీక్షలు తదితర అంశాలపై లోతైన దర్యాప్తు చేస్తే మరిన్ని అంశాలు వెలుగుచూసే అవకాశం వుందని పలువురు అభిప్రాయపడుతున్నారు. రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌ను సీజ్ చేయడమే కాదు, దీనిని భ్రష్టు పట్టించిన నిర్వాహకులపై కఠిన చర్యలకు కలెక్టర్ ఉపక్రమించినపుడే ప్రజాభిమానం పొందుతారు.




**సీజ్ చేసిన నెల్లూరు రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంక్.**

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/09-11
జమీన్‌రైతు

# బలీయమైన రాజకీయశక్తిగా శ్రీధర్!

## ● పాదయాత్రకు ప్రజాదరణ.



రాజకీయాలు కొందరికి వడ్డించిన విస్తరి. పదవులు, పలుకుబడులు వాటంతట అవిగా కలిసి వస్తుంటాయి. కొందరికేమో అది పుల్లని ద్రాక్ష. అందినట్లే ఉంటుంది తప్ప, చేతికి దొరకదు. దానితో ఆశ చావదు, దాన్ని తీర్చుకోవడానికి నిరంతర పోరాటం, గొడ్డు చాకిరి. ఈ రెండో కోవకు చెందినవాడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి. పాతికేళ్ల నుంచి రాజకీయ నిచ్చెనలు ఎక్కడానికి శ్రీధర్‌రెడ్డి చేయని ప్రయత్నం లేదు. కానీ అమాంతం మింగేసే పాములు తప్ప ఒక్క నిచ్చెనా ఎదురు రాలేదు. పట్టువదలని విక్రమార్కుడు జ్ఞాపకానికి వస్తాడు శ్రీధర్‌ను తలచుకొన్నప్పుడల్లా.

నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో శ్రీధర్‌రెడ్డి నిర్వహిస్తున్న 141 రోజుల మహా పాదయాత్ర ఈ తత్వానికొక ఉదాహరణ. వైఎస్ఆర్ కాంగ్రెస్ తన జాతకం మారుస్తుందనే ఆశతో అటు అడుగులు వేశాడు. కానీ కడుపులో చల్ల కదలకుండా రాజకీయం చేసే కాకాణి గోవర్ధన్‌రెడ్డి వంటి వారికి రానున్న ఎన్నికలలో టిక్కెట్ ఇంటి వాకిట్లో ఎదురు చూస్తున్నది. జగన్ జెండా బరువును అందరికంటే అధికంగా భుజం వంగిపోయే వరకు మోసిన శ్రీధర్‌రెడ్డికి మాత్రం మళ్లీ చూద్దాములే అనే సమాధానం. నిజం చెప్పాలంటే ఈ రోజు నెల్లూరు టౌన్‌లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌లో పది మంది మనుషులున్న నేతలెవరనే జాబితా వ్రాస్తే మొదటి పేరు శ్రీధర్ రెడ్డిదే అవుతుంది. పార్టీ కోసం వీధులలోకి వచ్చిన వారెవరన్న లెక్క తీస్తే కూడా అతడి పేరే ముందు ఉంటుంది. అంగట్లో అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని అన్నట్లుంది పరిస్థితి. ఈ తీరుమార్చడం కోసం శ్రీధర్‌రెడ్డి తలపెట్టిన రాజకీయ యజ్ఞమే మహాపాదయాత్ర. నియోజకవర్గంలోని ప్రతి గ్రామంలో, ప్రతి గడపా తొక్కాలన్నది దీని లక్ష్యం. తద్వారా భవిష్యత్తులో ఏ ఎన్నిక వచ్చినా నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో తాను తప్ప మరొకరు పోటీకిదిగే సాహసం కూడా చేయకూడదన్నది ధ్యేయం. అందుకోసం వళ్లు పచ్చి పుండుగా మారుతున్నా లెక్క చేయకుండా కాళ్లరిగేట్లు తిరుగుతున్నాడు.

జనంలో జగన్ పార్టీకి ఉన్న మోజు, కాంగ్రెస్ పట్ల విరక్తి, రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అంటే కలుగుతున్న ఏవగింపు కలగలిసి శ్రీధర్‌రెడ్డి పాదయాత్రను నల్లేరు మీద నడకగా నడిపిస్తున్నాయి. ప్రతి గ్రామంలో సాదర స్వాగతం లభిస్తున్నది. విస్తృత పరిచయాలు ఏర్పడుతున్నాయి. బలీయమైన రాజకీయ శక్తిగా ఎదిగేందుకు దోహద పడుతున్నది. మొదట మొదట ఇటు వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలు, అటు స్థానిక ఎమ్మెల్యే వివేకానందరెడ్డి కూడా దీనికి పెద్ద పట్టింపు చూపలేదు. కానీ రోజురోజుకు గ్రామాలలో తన మీద రోత పుట్టిన ప్రతివాడూ శ్రీధర్‌రెడ్డితో కాలు కలుపుతుండడంతో వివేకాలో చలనం వచ్చింది. ఆ అక్కసుతో నోరు పారేసుకొన్నాడు. గడప గడపకు జగన్ పార్టీ అంటూ వస్తున్న వారు ఇళ్లలో సామాను దొంగలించే చిల్లర దొంగల వంటివారని, వారితో ఆడపడుచులు జాగ్రత్తగా ఉండాలని ఎగతాళి వ్యాఖ్యలు చేశాడు.

తమ భవిష్యత్తు మెరుగుపరచుకోవడం కోసం ఇట్లా ఒంటికి మించి శ్రమించడం రాజకీయ వాదులకు అలవాటే. గతంలో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మధ్య

కొరవ 14వ పేజీలో



నెల్లూరీయుడు, బెంగుళూరులో స్థిరపడ్డ పోచారెడ్డి భక్తవత్సలరెడ్డి కుమారుడు గోపీనాథ్‌రెడ్డి, మేఘనారెడ్డిల వివాహం డిసెంబర్ 1తేది బెంగుళూరు వైట్ ఫీల్డ్‌లోని హోటల్ ఫార్చున్ సెలెక్ట్ ట్రినిటిలో జరిగింది.





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com